కవితిలక గ్రంథమాలా.

శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహా విద్యాపీఠమ్.

# అమృతసందేశః



వైద్యరాజ,

దంటు సుబ్బావధాని కవిరాజ ప్రణీతమ్



విజయవాడ

ఆంధ్ర గ్రంథాలయ ముద్రాక్షరశాలాయాం ముద్రాపితః

1939



[మూల్యమ్ 0-4-0.

సప్తమ ఆంధ్రీయాయుర్వేద సభ కగ్రాసనాధిపత్యము

వహించిన నాఁడు

వైద్యరాజ, డాక్టరు

# దంటు సుబ్బావధానిగారికి

బ్రహ్మశ్రీ శతావధాని: చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారు చేసిన

# ఆశీర్వాదము

సీ॥ పండితవంశానఁ బ్రభవించినాఁడు సం
పాదించినాఁ డసామాన్యగరిమ
మనవైద్యమున హూణఘనవైద్యమునఁ గూడ
హెచ్చుపరీక్షల నిచ్చినాఁడు
కులవిద్య లాంగిలేయుల విద్యలనుగూడఁ
జవిచూచి సారంబు దవిలినాఁడు
సభలలో నాయూప్రసక్తుల మాటాడ
నేర్చినాఁడు యశంబు గూర్చినాఁడు

అమృతహస్తి దయాళుండు విమలమతియు
దంటు సుబ్బావధాని సదస్యహృదయ
వేది నేటి యాయుర్వేదవేది నధిక
రించు టది దేశభాగ్యప్రపంచగరిమ.

# ఆంధ్రభామినీవిలాస ప్రశస్తి.

శ్రీకింకవీంద్రఘటాపంచాననాది బిరుదాంచిత శతావధాని

చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి ప్రణీతము

మ॥ ప్రకటింపంగదవయ్య నీ మృదుకవి
త్వం బేల యాలస్య మా
రక గావించెదు ? వైద్యరాజబిరుద
భ్రాజిత్వ మట్లుండఁగా
సుకవీశానత కూడ నీకుఁ గలిగెఁ
సుబ్బావధానీ! భవ
త్సుకులీనుల్ ప్రతివారు పండితకవుల్
శుద్ధాత్మకుల్ కర్మఠుల్

ఆ॥ వె॥ భామినీ విలాస మేమి, నీసుకృతం బ
యా! మనీషి! కావ్య రామణీయ
కమ్ము చెడక యుండఁగాఁ దెల్గుచేసితి
సంతసించినాఁడ జదివి చదివి.

శ్రీ కవిసార్వభౌమ, మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ,
ఆంధ్రవ్యాస శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రిగారి

# ఆశీర్వాదము



తే॥ గీ॥ అనఘు నవధాని నవవిభో యనుచు హరిని
వర్ణనమొనర్తు వరదంటు వంశగుణాని
ధానమని కవిధాత సుధానముఁడు న
నియును నల్గానియుఁ బేరు నిర్ణయించి.

చ॥ మువురుజగత్త్రయంబరయుమూర్తులయైననునొక్కమూర్తియై
ప్రవిమలసత్యయోగమునఁ బ్రస్తుతికెక్కెనటంచుఁ దెల్పుచు
న్నవు రవధాను లిందరయఁ బొంపెసఁగారుచునున్న నొక్కఁడే
యవు సని యాడిఁ బేర్కొనుట నాతనితత్త్వముబోధచేసెడిన్.

మ॥ గురుపీఠంబున కాధిపత్యమును శ్రీగుర్వాజ్ఞఁ గైకొంచుఁ ద
ద్వరకాయంబన నొప్పు కార్యభరముం దాఁబూని విద్వత్కవీ
శ్వరసంపన్నముఁ జేసి వాసిఁగొననై వర్తించు శ్రీదంటు వం
శ్యరమానాథుఁడు ప్రోచుఁగాక సతమున్సుబ్బావధానిన్దయన్.



# శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠము
## అధిపతి, వైద్యరాజ దంటు సుబ్బావధాని
# విబుధానందము

---

విద్వత్కవిరత్న ధర్మస్థాపక,
పూజ్య ఉమామహేశ్వర శాస్త్రిగారు.

శ్రీమద్వేదషడంగదర్శనకలాభాషాసముద్ధారకం
విద్యాపీఠ మిదం ప్రతిష్ఠిత మిహ త్రైలింగ మార్యావనౌ,
ధర్మోద్ధారకృతే మహాకలివిభుప్రస్థానదుశ్శాసనా
క్రాంతాయాం విబుధార్హకం విజయతాం శ్రీనాథకారుణ్యతః. 1

బ్రహ్మక్షత్రవిదగ్రగేయ మమృతాసందేశ్వరో దేశికః
ప్రత్యక్షా న్నిగమాగమాదికమహావిద్యాభివృద్ధ్యైవిదామ్,
సమ్యక్సైన్యవివృద్ధ్యై ర్విరించివనితామోదాతిరేకప్రదై
ర్వేదోద్ధారకధర్మధారక మిదం త్రైలింగవిద్యాప్రదమ్॥ 2

యస్యాధీశ్వరతాం మహాకవి రయం సుబ్బావధాని సుధీ
శ్రీదంట్వన్వయకౌస్తుభః ప్రథితవా గ్ధర్మ స్వవిద్యారతః,
దేశే దుష్కలిదుర్విలాసవివశే కాలేయకోలాహలా
క్రాంతే ధర్మవినాశశాలిని మహావిద్యావిలోపాన్వితే. 3

శ్రీ విద్వత్కవిరత్నేన పూజ్యకుల్యేన ధీమతా,
ఉమామహేశ్వరవిదా స్వానందః ప్రకటీకృతః. 4

---

# శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠామృత

# సందేశ ప్రశంసా



[సాహిత్య స్థాపక కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి విరచితా]

శ్లో॥ సందేశోఽయం విబుధవినుతో రాజతాం వేదమార్గే
పూర్ణార్థాన్ శాస్త్రా నిహ పరసుఖా న్బోధయ న్స్వార్థసంస్థాన్,
స్వీకృత్యేమాం పరిణతికలితాం ప్రార్థనాం ప్రేమయూనాస్మాన్
సందేశం తం గమనసమయే వక్తు మీశ ! ప్రయామః॥

శ్లో॥ భో సందేశ ! ప్రథితకులజైః పండితై శ్శీలభాగ్యై
శ్శాంతస్వాంతై ర్భగవతి గురౌ భక్తిసన్నైశ్చ ధీరైః,
ఖ్యాతిం నీత స్త్వమసి భువనే వేదమార్గాభిరామే
గచ్ఛానందం మధురవచన స్సేతుశ శ్శేషశైలమ్॥

శ్లో॥ పాథేయం తే మధుర మసృజం ప్రీణయేయు ర్వైద్యరాజ
స్తత్త్వజ్ఞానం కవితిలకభా క్కాంచనాంబాపి సాధ్వీ
వక్తృవ్యాఖ్యా స్వివిధ విషయా స్పాండితా ధర్మవీరా
వ్యాప్తం నేతుం విభవనిచయం సోఽపి రెడ్డిశ్చ సాధుః.

శ్లో॥ శ్రీతిరుమల శబ్దాది శ్రీనివాసత్రిలింగభాక్,
మహావిద్యాశిరోరత్నం పీఠం త ద్రాజతాం చిరమ్॥



## బ్ర॥ శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిలవారు
## శ్రీ త్రిలింగ విద్యాపీఠపరిశంసగా వ్రాసిన
# పద్యములు

మ. అమృతానంద గురుండు చేయు నుపదేశాభిఖ్యపీయూష ము
త్తమురా లా కనకమ్మ సుబ్బనయు విత్తస్వామియా రెడ్డి స
త్తముఁడున్ గ్రోలి తదర్థ మాన్యులకు నందన్ జేయఁ ద్రైలింగ పీ
ఠమునం జేయు ప్రయత్న మిప్పటికి జూడం గంటి కామేశ్వరీ!

మ. తనసౌధమ్మునఁ బీఠమున్నిలిపి నిత్యం బేడుసారుల్ కృపా
ఖని శ్రీ వేంకటనాథు నర్చితునిఁగాఁ గావించుచున్ వేంకటా
ద్రి నివాసున్ స్ఫురియింపఁ జేసెడి కృతార్థీభూతసత్కావ్యవ
ర్ధని శ్రీమత్కనకాంబ భక్తి మిగులన్ ధన్యంబు కామేశ్వరీ!

మ. గురువాక్యంబుల సారమున్ సకలమున్ గ్రోడీకరించెన్ గవి
త్వరసం బొండొక తోడుచేసి భగవద్దాస్యంబుతో విద్వదా
దరముం బూని యొనర్చు సత్కృతులతో దంభానపేతంబుగా
జరుపున్ మా కనకాంబ జీవితము మెచ్చన్ జెల్లు కామేశ్వరీ!

శా. తాతాశాస్త్రియు దెందుకూరు కృతివిద్వన్మౌళి శ్రీపాద వి
ఖ్యాత శ్రీ నరసింహశాస్త్రి మఱియున్ గవ్యగ్రగణుల్ పీఠపున్
ఖ్యాతిన్ జెప్పఁ గలార లీ బుధుల నాకారించి నూరార్లు చే
సీ తన్వీమణి గారవించె వినియుంటే తల్లి! కామేశ్వరీ!

మ. పలువు ర్పండితు లేగుదెంచి కనకాంబా సౌధరాజమ్మునం
దలి శ్రీ వేంకటనాథు సన్నిధిని శాస్త్రంబుల్ ప్రసంగించు న
య్యెలమిం గాంచిన గద్దవాలపుర సాదృశ్యంబు నా నెమ్మదిన్
గలయంబ్రాకిస్ఫురించె భాగ్య మది నిక్కం బంబ! కామేశ్వరీ!

మ. కల లెల్లన్ నశియించి దర్శ శశినాగా నున్న యీ దేశమం
దలి విజ్ఞానము భావికాలమున నాధారమ్ము చేకూరు నో
వెలయన్ విత్తనముల్ లభింప వని తద్బీజంబుల న్నిల్ప నీ
తెలుఁగున్ బీఠముయత్నముల్ సలిపెడిన్ దీవింపు కామేశ్వరీ!

మ. కలికాలం బిది భక్తియన్నను విరాగంబన్న విజ్ఞానపుం
గలనంబన్న నభస్సుమంబు లగుచున్ గన్పట్టు నిప్పట్టునన్
గలిసంతారకుఁడైన వేంకటనగాగ్రిస్థాయి సేవించు నీ
తెలుఁగుం బీఠ మదృష్టవంత మని నే దీవింతుఁ గామేశ్వరీ!

---

ధర్మస్థాపక తర్క-వేదాంత విద్యావిశారద

**ముదిగొండ వేంకట రామశాస్త్రి విరచితము**

ఈ త్రిలిఙ్గ మహావిద్యా పీఠస్థాపకులగు శ్రీమదమృతానందనాథస్వామివారి యమూల్యమగు జీవన్ముక్తానందావస్థితిని బ్రత్యక్షముగ గాంచు భాగ్య మస్మదాదులకు లభింపకపోయినను దత్సంకల్ప పరిణామచిహ్నము లైనట్టియు చతుష్షష్టి కలోద్ధరణాత్మక కార్యవిజ్ఞాన బీజసంరక్షణానుకూలులైనట్టి తచ్ఛిష్య ప్రచారములవలన శ్రీ కాంచనపల్లి కవితాకల్పవల్లి కనకాంబామతల్లి శ్రీ వైద్యరాజ శ్రీపీఠాధిపతి దంటు సుబ్బావధానులు, తత్సోదరులు ధర్మమూర్తి వైశ్యకులావతంస శ్రీ రెడ్డిగార్లు మున్నగు తచ్ఛిష్య మహాశయులకు గల యవ్యాజ నిరుపమాన గురుదేవతా భక్తి భావములవలనను స్ఫుటముగ ననుమేయించి (ఊహించి) యిట్టి కలికాలములోగూడ నిట్టి ధర్మావలంబన లాభమునకు గర్వించుచు సమందానంద భాగ్యము నొందుచున్నాము.

---

శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠము.

# ప్రధానోద్దేశము

## [మ. రా. శ్రీ చుండూరి వెంకటరెడ్డిగారి నివేదిక]



వేదశాస్త్రవిహిత స్వధర్మ తత్త్వనిరత సదాచారపరాయణులైన వారికి గురుముఖంబున సర్వసంశయ నివృత్తిద్వారా పరమశాంతిని లభింపజేయు భగవద్భాగవతకైంకర్యము, శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠము యొక్క ముఖ్యోద్దేశము. వేదము ధర్మమూలము. స్మృతిశాస్త్రపురాణేతిహాసములు దాని యర్థమును వివరించునవి. శిష్టసమ్మతమైన సద్గురుపరంపర వేదార్థానుభూతి నుపదేశించునది. గురూపదేశములేని శాస్త్రవ్యాఖ్యాన కౌశలమును, సదాచారసంపత్తిలేని స్వచ్ఛందవృత్తియును పరమార్థలబ్ధికి విరోధంబులు. "లక్షేషు జ్ఞానవాన్ కోఽపి" యన్నట్లు పై సిద్ధాంతములందుఁ బ్రమాణబుద్ధిగలవా రెందరో యుందురు. కాలవశమున ప్రళయమున విశ్వమువలె నధర్మవిజృంభణమున భరతఖండము మునిఁగియున్నను, గురుపరంపరమాత్రము కులగిరులవలె తల పైకెత్తుకొనియే నిలిచియుండి, తమ్మాశ్రయించినవారిఁ దమంతవారినిగఁ జేయుచుండును. ఆర్యవిజ్ఞానమునకు జిజ్ఞాసువు లధికారులు. వేదశాస్త్రవిహిత ప్రవర్తనము, మానవజీవిత పరమార్థప్రాప్తికి విరోధ మనియు, నాధునిక విశ్వసోదరత్వబోధములు, పరమార్థప్రాపకంబులనియుఁ దలంచుట సమంజసముకాదు. స్థూలభేదములెన్నియుండినను, నుత్తమపురుషార్థమైన మోక్షపదప్రాప్తి కెల్లరు సమానముగ నర్హులని మన పెద్దల యాశయము. ఇం దెచ్చు తగ్గులు లేవు బ్రాహ్మణులకైన, జండాలులకైన యవన పుల్కసాదులకైన మోక్షమున కర్హతగలదని సద్గురువులయాశయ మగుటచే నీవిషయమున నేఁడు కొందఱు పడు దురభిప్రాయమున కెట్టి యవకాశమును లేదు.

తీవ్రవైరాగ్యము పరిపూర్ణజిజ్ఞాసయు మొదలగు నధికారసంపత్తి గలిగిన వెంటనే మోక్షమున కర్హులనుట వేదసమ్మతమని యెఱుంగునది.

1. సరదాగా పరమార్థమును గోరువారు దారిలోఁ బోవుచుండ శ్రమలేక యెదుటబడిన మాణిక్యమును బొందగోరువారలు.

2. కొందఱు రాజసశ్రద్ధ గలిగి వేదాంత గ్రంథపఠనశ్రవణాదు లొనర్చుచు, స్థూలకర్మము నిర్వహింతురు కాని నిరహంకారులై గురుదీక్ష వహింపజాలరు.

3. సాధన చతుష్టయసంపత్తి గలిగి సదా సద్గురు సంసేవాలబ్ధమైన యుత్తమదీక్ష వహించుచు, "తచ్చింతనం, తత్కథనం అన్యోన్యం తత్ప్రబోధనం" అన్నట్లు సర్వకాలసర్వావస్థలయందు బ్రహ్మైక్యానుసంధానం బొనర్చుచు దానినే యుపన్యసింపుచు నద్దియే యన్యోన్యప్రబోధం బొనర్చుకొనుచుండువారు నుత్తమాధికారులు. వీరలోను సకల లౌకిక వ్యవహారంబుల నిర్వహింపుచుండియు జనకునివలె సద్గురు సంసేవాలబ్ధమైన మోక్షమార్గ మనుసంధించుచు జీవన్ముక్తిని సాధించువా రుత్తమోత్తములు.

ఈశ్వరానుగ్రహ లబ్ధమైన జీవబ్రహ్మైక్యానుభూతి నధికారానుసారము జిజ్ఞాసువులకు గలిగించుటకు సద్గురు పీఠము లెన్నియేని భరతఖండమున వెలయుచున్నవి. ఈ త్రిలింగ పీఠస్థాపనాచార్యులగు నమృతానందనాథస్వామివారు గురుకటాక్షమునొంది పూర్ణాధికారమునొందినది మొదలు తమ సన్నిధికి వచ్చిన భక్తులకుఁ గరతలామలకముగఁ దత్త్వబోధనము జేయుచుండెడివారు. ఆంగ్లేయ భాషా పరిచయము గలవారిచే, కార్లైలు, ఎమర్సన్, క్యాంటు, డ్యూసన్ మొదలగు పాశ్చాత్యవేత్తల గ్రంథములఁ జదివించి వానితో మన గ్రంథములను బోల్చి పాశ్చాత్య ప్రవక్తల యసమగ్రత యార్యుల సంపూర్ణత నిరూపించుచుండువారు. అమృతానందుల తత్త్వబోధ మనన్యము. తాము చెప్పదలఁచుకొన్న విషయములను సమగ్రముగా సామాన్య భాషలో పరిభాషా వర్జముగా సుబోధముగాఁ బ్రతిపాదించిన పిమ్మట, భాష్యాది గ్రంథములలో నీవిషయ మెక్కడ వివరింపఁబడినది నిరూపించుచుండువారు. అంతియ కాని గ్రంథము మొదలు పెట్టి పంక్తివెంట పంక్తి కెన్నఁడు నర్థముచెప్పి గ్రంథము ముగించువారు కారు. శ్రీవారి పద్ధతిలో విశేష మేమనఁగా వారి బోధము విన్నవారికి గ్రంథములు చూచినంత మాత్రముననఁ బ్రత్యేకము పాఠము చదువ నక్కర లేకయే సమన్వయించును. ఈపీఠము స్థాపించిన పిమ్మట శ్రీ వారి

బోధములో నొక పెద్దమార్పు కలిగినది. కలికాలవశంబున జిజ్ఞాసువుల సంఖ్య తగ్గుటయు నున్నవారలలోఁ జాలమందికి మూలగ్రంథములను జూచుకొనగల్గు సంస్కృత భాషాజ్ఞానము లేకపోవుట తటస్థించుచున్నది. ఈవిషమ స్థితి జీవయాత్రలో నిట్లు వర్ణింపఁబడినది.

ఉ. "చక్కనిబోధలన్ వినఁగఁ జాలవు చాలవు భాష్యశాంతికిన్
మక్కువ బొంగవాళిపయి మానవు మానవు దుష్టవాసనల్
పెక్కువిధంబులన్ దలపు పెంచెదు పెంచెను సంచితంబు నే
ఫక్కిఁ దరింతువో తెలియవచ్చునె వచ్చునె నీకు జ్ఞానమున్."

పరమకరుణాఖండులగు నమృతానంద నాథస్వామి వారీ విషమ పరిస్థితులు గమనించి మూలగ్రంథము చదువగలిగిన కొలఁది యాశ్రితులకు మాత్రము వానిజాడలందు నిరూపించి తక్కినభక్తుల కాంధ్రభాషాప్రధానులగు వారికై తమ బోధములన్నియు వ్రాయించిరి. శ్రీవారు మేఘము వర్షించినట్లు గంగా గోదావరులు ప్రవహించినట్లు బోధములు వెలువరించుచుండఁ బట్టగలవా రెవరు.

ఆంధ్రుల భాగ్యవశమున శ్రీమతి కంచనపల్లి కనకాంబగారు శ్రీవారి బోధములకు శ్రోతగా కుదురుట తటస్థించినది. ఆమహాకవయిత్రి వచనమున మొదట శ్రీవారి బోధములన్నియు లిఖించుకొని ప్రతిదినము, జపావసానంబున నావచన మంతయుఁ జక్కని పద్యములలోనికి మార్చినది. అట్టివియే జీవయాత్రాది గ్రంథములు.

ఆధునికకాలమున వెలువడిన కొన్ని సంప్రదాయములలో స్నానసంధ్యాది నిత్యకర్మానుష్ఠానములకు ప్రాధాన్యము లేదు. విడిచివేసిన ప్రత్యవాయము లేదు. నూత్నపద్ధతులలో మంత్రవర్జముగా భాషాబహుళముగాఁ బ్రార్థనలను జరుపుచున్నారు. త్రిలింగపీఠమందు సాధకులు స్నానసంధ్యాది నిత్యకర్మానుష్ఠానములు వర్ణాశ్రమాచారోచితముగ నొనరించుటయే శ్రీవారి యాశయము. "న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసంగినాం," పీఠములో నన్ని యధికారములకు కలిసివచ్చునట్టి పంచాయతన దేవతార్చనము నిత్యము జరుగునట్లు అమృతానందనాథ స్వామివా రేర్పాటు చేసినారు. పిదసంకల్పముగాన నది యవిచ్ఛిన్నముగాఁ బీఠములో నేటికి

జరుగుచున్నది. ఉదయము సాయంకాలము జరుగు నీ పూజలేగాక ప్రతి సాయంకాలము రెండుగంటలకాలము, భగవన్నామసంకీర్తనము భజన రూపమునఁ జేయ బడుచుండును.

"యాంతే మతి స్సాగతిః" అను న్యాయమున నంత మెప్పుడో తెలి యదు గావునను బరీక్షిత్తువలె నెల్లరకు మరణకాలము తెలియదుగావున నెని మిది జాములుకూడ భగవద్భాగవత కైంకర్యము జరుగునట్టి సత్రయాగము నకు సంకల్పించి శ్రీఅమృతానందనాథస్వామివారు "సత్రయాగశాల" కధి కారిగా తమకు బ్రధానశిష్యు డగు దంటు సుబ్బావధాని గారిని నియమించిరి.

1925 మొదలు 1930 వఱకు నైదుసంవత్సరము లీ సత్రయాగము కొన్నినాళ్ళు నెల్లూరు మండలములో సువర్ణముఖితీరమునఁ దుంబూరు గ్రామమునందును, గొంతకాలము కడపజిల్లాలో శ్రీ వేంకటేశ పాదోద్భవ యగు విరజానదీతీరముననున్న కోడూరుగ్రామమునను నిర్వహింపఁబడెను. పైనివర్ణించిన దేవతార్చనముకాక, శ్రీమద్భాగవత రామాయణాది పురాణ పఠనమును, ప్రస్థానత్రయభాష్యపాఠములును, హరికథా కాలక్షేపములు మొదలగువానిచే నిరువది నాలుగుగంటలు భగవత్సంకీర్తన మీ పీఠమున జరుగుచుండెను. ఘనాంతస్వాధ్యాయపరు లిద్దరు సశిష్యులై వేదఘోష మొనరించుచుండిరి. ఈ సత్రయాగము జరుగుకాలములో జిజ్ఞాసువు లగు శిష్యులెల్లరు తండులాదిక భిక్షాటనము చేసి యహంకారపరిత్యాగ మొనరించు కొనిరి. ఇందుల భగవత్సేవాదికము ను జూచి యానందింపవచ్చిన చాతు ర్వర్ణ్యమునకు నిత్యము సమారాధనము జరుగుచుండెను. ఆహారాదినియమము కొరకై పీఠములోని శిష్యులు, శ్రీవారుకూడ నారుమాసములు,దినమునకొక్క కొబ్బరికాయపుచ్చుకొని జపతపంబు లొనర్చుచుండిరి. సాధకులగువా రాయా సమయంబుల దీక్ష వహించుచుండిరి. ఈ సత్రయాగసమయమున శ్రీ అమృ తానందనాథస్వామివా రొనరించిన బోధాదికము త్వరలో వెలువడనున్న శ్రీస్వామివారి చరిత్రమున వివరింపఁబడును. సత్రయాగముజరుగుకాలమున నెలకు రు300 రూపాయలు మొ॥ వెయ్యిరూప్యములవరకు వ్యయమగుచుండెడిది.

ఐదుసంవత్సరంబు లీవిధి నహోరాత్రంబు లవిచ్ఛిన్నంబుగ నపూర్వ భంగి నీసత్రయాగము జరుగుచున్నకాలములో దీనిని గుఱించి బత్రికలలో

గాని, విడిగాగాని యెన్నఁడు ప్రకటింపబడలేదు. సర్. అల్లాడి కృష్ణస్వామి అయ్యరుగారు, ఆర్కాడ్ పరశురామరావుపంతులుగారు, దేశోద్ధారక నాగేశ్వరరావుపంతులుగారు మొదలగు ప్రముఖులు సత్రయాగకాలము నెఱుంగుదురు. బాహ్యరూపమున బహుధనసాధ్య మగు నీ సత్రయాగము నంతట బరిసమాప్తి నొందించి, యాభ్యంతరసాధనలు, పంచాయతన దేవతార్చనలు, వేదాంతవిచారమును ప్రధానముగఁ ద్రిలింగపీఠమున జరుగునట్లు శ్రీవారేర్పాటుచేసిరి. "నిద్రాసమాధిస్థితిః" అన్న న్యాయమున నిద్రాకాలము తప్ప తెల్లవారుజామున బ్రాహ్మముహూర్తము మొదలు శయనించువఱకు నీపీఠమందిప్పటికి నేదో రూపమున భగవద్భాగవత కైంకర్యము జరుగుచున్నది.

## పీఠప్రచారము.

ఆర్యవిజ్ఞాన బీజసంరక్షణ మీపీఠముయొక్క బాహ్యకృత్యములలో ముఖ్య పని గురువుల యాశయము.

## అమృతానంద నాథులవారి సందేశము.

"సర్వం ఖల్విదం బ్రహ్మ" "నేహ నానాస్తి కించన" యనుటలో "హరిమయము విశ్వమంతయు" ననియున్నది కాన మాకు లోకముపై నిచ్ఛాద్వేషములు లేవు. "అన్వయవ్యతిరేకములుగా ధర్మాధర్మంబు లీవిశ్వంబున బరమ జిజ్ఞాసువుల బోధముకొరకును, తనవినోదముకొఱకును పరమేశ్వరుడు సృష్టించెను. అందధర్మ ప్రవృత్తి నేఁడు విశేషముగ నున్నది. ఇట్టి తఱి లోక కల్యాణమునకై యార్యవిజ్ఞానమును గాపాడవలయును. రాజబలము సంఘబలము దీనికి తోడ్పడుట నేటి కాలమున నరిది. కావున గాయత్రీ మంత్రార్థానుసారముగా ధర్మనిర్వహణోత్సాహ మెవరికి కలుగునో వారలే సంఘీభవించి యథాశక్తిగ నధీతబోధాచరణ ప్రచారణములు గావింపవలయును.

వేదవేదాంగములు, కళలు, భాషాగ్రంథములు పోష్యములు. శేషించియున్న విద్వాంసు లందఱను బరిగణనముచేసి తారతమ్యములు నిరూపించి యుత్తములను సన్మానము చేయుచుండవలెను. ఒక్కొక్కవిద్య కొక్కొక్కరినైనఁ బరంపర నిలువబెట్టుటకై పోషింపవలయును. కలికాలవశమున బహుళ ప్రచారము లేకపోయినను దేశకాలము లనుకూలించిన నాఁడు విస్తరించుటకై జ్ఞానబీజములు నిలిచియుండవలెను. గీర్వాణభాషావైరళ్యము

గల యిక్కాలమున తొల్లింటి మహానుభావు లాంధ్రమునఁజేసిన తత్వబోధ మునకు తోడుగా సంపూర్ణవిజ్ఞానలబ్ధికి కావలసిన సామగ్రి యీత్రిలింగ పీఠమున దైవయోగముచే నెలకొల్పఁబడియున్నది. త్రిలింగ దేశమునకు పీఠము నీ పీఠమునకు త్రిలింగ దేశము నన్యోన్యపోషకంబులై యుండు నీశ్వర సంకల్పము సిద్ధించుగాక.”

అమృతానందనాథస్వామి యంతరంగ మీనాటికి ప్రచురించి కృతార్థులమైతిమి. ఆంధ్రమహాజను లీ స్వధర్మము నిర్వహింతురు గాక. ప్రపంచమున భరతఖండ మెట్లు ప్రత్యేకవ్యక్తిత్వముఁ దాల్చియున్నదో, భరతఖండమున నాంధ్రదేశమునందు గురుపరంపరలో నిలిచియున్న తత్త్వబోధ మొక విలక్షణమై యనన్యదుర్లభమైన వన్నె గలిగియున్నది. దానిని వ్యక్తీకరించుటయే యీత్రిలింగ పీఠకర్తవ్యము.

ఈ పీఠమునకు శరీరమై సకల కార్యములు నిర్వహించుటకు గురువులచే నియమింపఁబడినవారీ దంటు సుబ్బావధానిగారు. అవధానులగారి విలువ అమృతానంద నాథులవారెఱుగుదురు. అమృతానందనాథులవారి యంతరంగము నవధానులుగా రెఱుగుదురు. కాని సద్గురుమూర్తి పేరు విన్న మాత్రమునఁ బులకితగాత్రుఁడై సాశ్రులోచనుఁడై ప్రపంచమును మఱచిపోవు నంతరంగభక్తుఁడీ యవధానిగారని నేనెఱుంగుదును.

ఈ పీఠమునఁ గార్యనిర్వహణమున కవధానులగారికి నస్మదాదులు భక్తులు, గరణములమై, యుపకరణములమై యున్నాము.

ఈ పీఠము నాశీర్వదించు సత్పురుషులు, పండితులు, కవులు, పరోక్షప్రియులగు దేవతలు. ఇట్టి పరమోత్కృష్టమగు సామగ్రి దైవయోగమున నీ పీఠమునఁ బెద్దలయాశీఃప్రభావంబున సంపూర్ణఫలము నొసంగి యాంధ్రదేశమునకు సకల మంగళముల సమకూర్చుగాక.

ఇట్లు, విన్నవించు విధేయుఁడు,

**చుండూరు వెంకటరెడ్డి.**





వైద్యరాజ, దంటు సుబ్బావధాని
అధిపతి : శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠము

శ్రీభాస్యాయనమః.



శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠమువారి

# అ మృ త సం దే శ ము

వైద్యరాజ, దంటు సుబ్బావధాని కవిరాజ విరచితము.

---

శ్లో॥ శ్రీ దేవీ విజయం దద్యా ద్దేహస్య పటుతాం సదా
బుద్ధిం ప్రసన్నాం ధ్యానంచ గురుపాదాంబుజే స్థిరమ్. 1

బ్రహ్మవిద్యా స్వరూపిణియు, గురుస్వరూపిణియుఁ, బరా శక్తియు, శ్రీరాజ రాజేశ్వరీ పరాభట్టారికయు ననం బఱగు శ్రీ దేవి భక్తులకు విజయమును, దేహపటుత్వమును, ప్రసన్నమగు బుద్ధిని, గురుపాదపద్మములయందు స్థిరమైన ధ్యానము ననుగ్రహించుగాక! విజయమనఁగా వాసనాత్రయ జయము. ఇంద్రియజయము.

శ్లో॥ పాలావఝ్ఝుల నాగభూషణ గురుప్రాప్తార్యవిజ్ఞానభాక్
త్రైలింగ్యాన్వయ వేంకటప్పయ సుధీసూను ర్బుధారాధకః
వాణీప్రీతకవీశ్వర శ్శ్రితజనానందాబ్ధిచంద్రోదయో
దుర్గాంబాచరణారవిందమధుప స్సుబ్బావధానీ కృతీ. 2

త్రైలింగ్యాన్వయుండును, దంటు వెంకటప్పయశాస్త్రి కవివరునికిని దుర్గాంబకును జనించి వారి చరణారవిందములు సేవించునట్టివాఁడును, దనవాక్కుచేతఁ గవీశ్వరులను సంతోష పెట్టువాఁడును నగు సుబ్బావధాని యనుకవి; పాలావర్ఘుల నాగ భూషణాఖ్యతో వ్యవహరింపఁబడుచు నమృతానందనాథస్వామి యను దీక్షానామము వహించి, శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠస్థాపనాచార్యు లయి వెలసిన గురుస్వామి చర ణారవిందముల సన్నిధి నార్యవిజ్ఞానమును బొందుటచేఁ గృతార్థుఁ డాయెను.

శ్లో॥ పరాం దేవీం వందే శ్రితజనపరా మంబుజకరాం
నిరాలంబా మంబాం నతసురకదంబా మభయదామ్
దురారాధ్యాం సాధ్యాం గురుపదయుగధ్యానకుశలై
శ్శివాం లక్ష్మీ స్సం బ్రాహ్మీం శివ హరి విరించి స్తుతపదామ్. 3

ఆశ్రితజనుల ననుగ్రహించునది, పద్మములవంటి కర ములు గలది, సకలమున కాధారమైనది, యెల్లలోకములకు దల్లియైనది, దేవతాసమూహములచే సేవింపబడునది, యభ యము నొసంగునది, సామాన్యుల కారాధించుట కలవికానిది, గురుపదములను ధ్యానించు భక్తాగ్రగణ్యులకు సులభమైనది, శివ హరి విరించిస్తుతమైన పాదములుకలది, మహాకాళీ, మహా లక్ష్మీ, మహాసరస్వతీ స్వరూపముఁ దాల్చినదియు నగు నా పరాశక్తికి నమస్కరించెదను.

శ్లో॥ అంబికే తవకరావలంబనా
త్ర్యంబకోఽభవ దహో యమాంతకః
వాసనాత్రియసమాహతం నతం
మాం కురూదరదరీనివాసినమ్. 4.

ఓ యంబికా! ఓ తల్లీ! నీ కరావలంబముచే నిన్నుఁ జెట్టపట్టుటచే మూడుకన్నులు గల శివుఁడు యమాంతకుఁ డాయెను. వాసనాత్రయము (దేహవాసన, లోకవాసన, శాస్త్ర వాసన) చేఁ గొట్టఁబడుచున్న నన్ను నీ కడుపునఁ బెట్టుకొని కాపాడుము.

శ్లో॥ మూఢలోక పరివాదశోధితం
శ్రీగురూత్తమ కరాబ్జపావితమ్
కాంచనాంబర పదాంబుపూరితం
మన్మనఃకలశ మంబ గృహ్యతామ్. 5

మూఢజనులుచేయు నిందలచేఁబరిశుద్ధిచేయఁబడినదియు శ్రీ గురూత్తముని కరాబ్జములచేఁ దొలచి పవిత్రముఁజేయఁ బడినదియుఁ, గాంచనాంబరుని పాదోదకముచే నింపఁబడినదియు నగు నా మనః కలశము (నా మానస మను పాత్రము) నో తల్లీ! నీవు గ్రహించి నన్నుగ్రహింపుము.

శ్లో॥ వృథా శాస్త్రాభ్యాసో హరి గురుపదధ్యానరహితో
వృథా శస్త్రాభ్యాస శ్రితజనపరిత్రాణరహితః
వృథా యోగాభ్యాసః పరజనవినోదైకమహిమా
వృథా యంత్రాభ్యాసః కరగతకళానాశనకరః. 6

హరిగురుపద ధ్యానములేని శాస్త్రాభ్యాసమువ్యర్థము. ఆశ్రయించువారిని రక్షింపఁజాలని శస్త్రాభ్యాసము వ్యర్థము. పరజనుల వినోదమాత్రమున కుపయోగపడు యోగాభ్యాసము వ్యర్థము. చేతితో నెంతటి కుశలముతోనైన వస్తునిర్మాణ మొనరించు నైపుణ్యమును జంపు యంత్రాభ్యాసము (మరలు మొదలగు నవి) వ్యర్థము.

శ్లో॥ దాక్షిణ్యం కుజనే దయా పరజనే శాఠ్యం సదాసజ్జనే
రక్షా పక్షజనే నయో నృపజనే విద్వజ్జనేఽనార్జవమ్
ద్వేషో వైదికదైవికార్థ్యగజనే మ్లేచ్ఛజనే గౌరవం
యే కుర్వం త్యధునా కలాసు కుశలా స్తేష్వేవ లోకస్థితిః 7

దుర్జనులయందు దాక్షిణ్యంబును (సజ్జనునియందు లేదనుట) కాని వారలయందు దయయును (అయిన వారల యందు లేదనుట) సజ్జనులయందు వంచనమును (దుర్జనులను సన్మానించుట) తమ పక్షము వహించినవారిని మాత్రము రక్షించుటయు, రాజులయెడల వాటము వెంబడి నడుచుకొనుచు దమ స్థితి కాపాడుకొనుటయుఁ బండితులయెడల కుటిల భావముతో వర్తించుటయు, వేదము, దేవుని నమ్మినవారియెడ ద్వేషమును మ్లేచ్ఛజనుల యెడ గౌరవంబు నెవరు వహింతురో యట్టి కళాకుశలులయందే లోకము నిల్చియున్నది. భర్తృహారిలో నన్నట్లు (దాక్షిణ్యం స్వజనే) యను శ్లోకమునకు కాలానుసార మగు విపరీతపాఠముగా నీ శ్లోకము కవిచే రచింపఁబడెను.

శ్లో॥ వాఙ్మిత్వం సుకవిత్వంచ సభారంజనకౌశలం
ఆచార్యత్వం పరిచారశ్చ పంచైతే మోక్షభంజకాః 8

వాఙ్మియగుట, కవియగుట, సభను రంజింపగల్గుట, ఆచార్యత్వము వహించి శిష్యుల దిద్దుట, లోక సంగ్రహార్థమై పరిచార మొనర్చుట - యివి యన్నియు స్వానుష్ఠానమునకును నాత్మానుసంధానమునకును నడ్డము వచ్చునవి గాన మోక్ష భంజకములు. మోక్షమును జెఱచునవి.

శ్లో॥ అహంకారం సమాశ్రిత్య శిష్యైఘావాప్తిహేతవే
దుర్గాంబే! యాపితః కాలో మూఢం మాంపాహి ముద్రయా.

ఈ శ్లోకమున కవి తన యహంకార పరిహారమును జేసికొనుచున్నాఁడు. ఓ తల్లీ! కనకదుర్గా! నే నహంకరించి శిష్య సంఘమును జేర్చుటకై కాలమంతయు వ్యర్థపుచ్చితిని మూఢుఁడ నైన నాకు జ్ఞానముద్ర ననుగ్రహించి రక్షింపుము.

శ్లో॥ ప్రామాణ్యవాదే పాండిత్యం సభాయాం సిద్ధిదం నృణాం,
ప్రామాణ్యం గురువాక్యేతు బ్రహ్మభూయాయ కల్పతే.

ప్రామాణ్య వాదమునందు (ఇది తర్కశాస్త్రము లోనిది) పాండిత్యము నరులకు సభలలో గౌరవము తెచ్చును. కాని గురువాక్యముల యందు ప్రామాణ్యబుద్ధి భక్తులకు బ్రహ్మత్వము నొసంగఁ గల్గును.

శ్లో॥ సర్వం హరిమయం విశ్వం విశ్వమేవ హరి స్స్వయం
ఆత్మరక్షాసమర్థ స్సః కా చింతా లోకసంగ్రహే. 11

హరియే విశ్వము, విశ్వమే హరి. సర్వసమర్థుఁడైన యా హరి తన్నుఁ దాను రక్షించుకొన గలఁడు. నాకేటికీ లోక సంగ్రహ చింత?

శ్లో॥ కింకుర్మోఽద్య క్వగచ్ఛామః కింబ్రూమః కయాశయా
సర్వం ఖల్విదమేవాహం నాఽన్యదస్తీ త్యనుస్మరన్. 12

ఇది యంతయు నేనే. నాకంటె వ్యతిరేకమైన దేదియు లేదను భాగవత వాక్యము స్మరించుచున్న మేమేమి యాశతో నెక్కడికిఁ బోయి యేమి చెప్పి యేమి చేయఁగలము?

శ్లో॥ ఆశాపాశం పరిచ్ఛేత్తుం విజేతుం వాసనాత్రియం
శూన్యస్థానే సదా రంతుం శరణం చరణం గురోః 13

ఆశాపాశములు త్రెంపుటకును వాసనాత్రియమును త్రుంచుటకును శూన్యస్థానమున సదా రమించుటకును శరణము గురుచరణమే.

శ్లో॥ త్రిలింగేషు శ్రీనివాస మహావిద్యాఖ్య ముత్తమం
పీఠం సాక్షాద్గురూద్దిష్టం కలౌ విజయ తేతరాం. 14

త్రిలింగ దేశమందు సాక్షాద్గురుమూర్తిచే నుద్దేశింపఁ బడిన తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠ ముత్తమమై యీ కలియుగంబున విజయమును గాంచుచున్నది. శ్రీశైల ద్రాక్షారామ కాళేశ్వరములయందుగల లింగములకు మధ్యగల దేశము త్రిలింగదేశము. "కలౌ వేంకటనాయక" యను న్యాయమునఁ గలియుగమున కధినాథుఁ డగుటచే నాతని శ్రీనివాసనామంబున నున్న గురుపీఠము సర్వోత్కృష్టతఁ

గాంచుచున్నది. మహావిద్య యనఁగా బ్రహ్మవిద్య. బ్రహ్మ విద్యనుపదేశించునది, పోషించు నట్టిది. తదంగత్వేన వేదశాస్త్ర పురాణేతిహాస కావ్య సంప్రదాయములచేఁ బోషింపఁబడు సమస్త ధర్మములు నీ పీఠమునకు సంబంధించినవే.

శ్లో॥ అమృతానందనాథేన నిర్మితం శర్మదం నృణాం
కర్మభూమే రలంకారో విద్యాపీఠ మనుత్తమమ్. 15

కర్మభూమి కలంకారంబును భరతఖండమున కలంకారంబును శర్మదంబు (స్వర్గాపవర్గప్రదంబు) నుత్తమం బగు నీ పీఠ మమృతానందనాథ స్వామి యను దీక్షానామము గల యాచార్యవర్యునిచే స్థాపింపఁబడినది.

శ్లో॥ యస్మిన్ ప్రతిదినం విష్ణుపంచాయతన పూజనమ్
సహస్రనామభిః పుష్పైః క్రియతే పరమాదరాత్. 16

మఱియు నీ పీఠమునందుఁ బ్రతిదినము విష్ణు పంచాయతనమందు నొక్కొక్క దైవతమున కొక్కొక సహస్ర నామ కుసుమ పూజన మర్పింపఁబడును. వేంకటేశ్వరస్వామికి త్రికాలములయందు సహస్రనామ కుసుమార్చనము చేయంబడును.

శ్లో॥ యస్మింశ్చ వేదవేదాంతసారం శ్రీగురుణోద్ధృతమ్
కనకగ్రంథపాత్రేషు పూరితం భవతారకమ్. 17

అదియునుం గాక యీ పీఠమునందు సద్గురుండగు నమృతానందనాథులవా రొనర్చిన భవతారకమైన బోధమను నమృతము గ్రంథములను కనకపాత్రిలలో నింపఁబడియున్నది. అనఁగా గురువులు చెప్పిన బోధ మంతయు, శ్రీమతి కవితిలక

కవితా విశారద కాంచనపల్లి కనకాంబగారిచే రచియింపఁబడిన జీవయాత్ర, అమృతసారము, నానందసారము, హంసవిజయము తోమాలియ మొదలగు గ్రంథములయందు నిండియున్నది.

మతత్రియాచార్యులచే నిర్మింపఁబడిన పీఠముండఁగా నీ పీఠమున కవసర మేమి యను సందియము కలుగవచ్చును. "శ్రుతే రివార్థం స్మృతి రన్వగచ్ఛత్" అనునట్టు లాచార్యపీఠములకు నమస్కరించియే వారి యభిప్రాయములను లోకమునకు వేదార్థంబును స్మృతి వివరించునట్లు వివరించి ధర్మప్రచారము చేయుటయే యీ పీఠముయొక్క కృత్యము.

శ్లో॥ ఆచారః ప్రథమోధర్మో యస్మిన్ సర్వేషు కర్మసు
అవైదిక మనార్షంచ న కించి దిహ దృశ్యతే. 18

ఈ పీఠమునం దాంధ్రదేశ ప్రసిద్ధమగు శిష్టాచారము ననుసరించుటయే ప్రథమధర్మము. ఋషిసాంప్రదాయమునకు వైదిక సాంప్రదాయమునకు విరుద్ధమైన దించుకయుఁ గానిపించదు. ప్రకృతకాలమున స్నానసంధ్యావందనాదులు, మడిమైలలు, వర్ణాశ్రమధర్మంబులు పాటింపకుండఁ దత్త్వబోధము జరుపునట్టి సంస్థ లెన్నియో కలవు. ఈ పీఠ మట్టిదికాక శిష్టసమ్మతమైన మార్గమున నడుచునదిగా నెఱుంగునది.

శ్లో॥ దేవతానాంచ భక్తానాం కైంకర్య మఘమర్షణమ్
అహంకారనిరాసార్థం భక్త్యా యత్ర ప్రకుర్వతే 19

మఱియు నీ పీఠంబున భగవంతునియొక్క సేవయు భాగవతులయొక్క పూజయు పాపశాంతికై, యహంకార పరి

హారమునకై భక్తితో జరుపఁబడును. "విదుష ఆత్మత్వా" త్తని గీతాభాష్యమునందుఁ బ్రసిద్ధమై యుండుటచే భగవంతునకు భాగవతులకు నభేదము ప్రసిద్ధమేకదా.

శ్లో॥ తదిదం పీఠ మాంధ్రాణాం జ్ఞానబీజప్రవర్ధకం
ఆచంద్రతారకం జీయా చ్ఛ్రీనివాస ప్రసాదతః. 20

కాబట్టి యాంధ్రుల దగు నీ పీఠము భరతఖండమున కంతకు జ్ఞానబీజప్రవర్ధకము. శ్రీనివాసునియనుగ్రహమున నీ పీఠ మాచంద్రతారకముగా విజయము నొందుగాక. ఆంధ్ర దేశమున వెలసియు భరతఖండ మంతయు వ్యాపించు వేంకటేశ్వరునిఁబోలె త్రిలింగ దేశమున వెలసియు నీ త్రిలింగ పీఠము భరతఖండమంతయు వ్యాప్తి కలిగియున్నది. యావద్భారతభూమియందు నీ పీఠమునకు బ్రచారమున్నదనుట కీ పీఠమువారు ప్రచురించు నమృతసందేశమే ప్రమాణము. వ్యవహారభాషయగుటచే నాంగ్లమందును బండితభాషయగుటచే గీర్వాణభాషయందు నీ యమృతసందేశ మాసపత్రిక పీఠపక్షమునఁ బ్రచురింపఁబడుచు భరతఖండమంతయుఁ బ్రచార మొనర్చుచున్నది.

శ్లో॥ కాలోఽయం విషమః ప్రాప్తః నో గురు ర్నచ దైవతమ్
మహతాం బీజభూతానా మపి యస్మి న్నజీవనమ్. 21

విషమకాలము వచ్చినది. గురువు లేఁడు. దేవుఁడులేఁడు. విత్తనములవలె దాచుకొనఁదగిన విద్యావంతులగు పెద్దలకుఁ

గూడ జీవనములు అనఁగా దేశవిద్యలు, శిల్పములు మొద లగునవన్నియు నశించుచున్న వనుట.

శ్లో॥ వేదశాస్త్రపురాణానాం వక్తా శ్రోతాచ దుర్లభః
సత్యశౌచాదయో క్షీణా నిదాఘే సరితో యథా. 22

వేదశాస్త్ర పురాణములను జెప్పువాఁడులేఁడు వినువాఁడులేఁడు. వేసవికాలమం దేరు లెండిపోయినట్లుగా సత్యదయాశౌచము లిగిరిపోవుచున్నవి.

శ్లో॥ బ్రాహ్మణా వేదవిముఖా శ్చాన్యే బ్రాహ్మణనిందకాః
పురుషార్థా హ్యర్థకామా పాండిత్యం తు ప్రతారణమ్ 23

బ్రాహ్మణులకే వేదమం దాదరము పోయినది. ఇతరులు బ్రాహ్మణులను నిందించుచున్నారు. చతుర్విధ పురుషార్థములలో ధర్మమోక్షము లెటో పోయినవి. ఎల్లరకు నర్థము, కామమే పురుషార్థములుగా నున్నవి. ఒకరిని మోసపుచ్చునై పుణ్యమే పాండిత్యముగా నెంచఁబడుచున్నది.

శ్లో॥ పరప్రత్యయనేయత్వం పరధర్మానుశీలనమ్
ప్రజానాం వృత్తిరద్యాఽభూ దాంధ్రాణాంచ విశేషతః.

తమయందుఁ దమకు విశ్వాసము లేకపోవుటయు బరులను విశ్వసించి పరధర్మము లలవఱచుకొనుటయు నేఁడు భరతఖండవాసులకు, విశేషముగా నాంధ్రులకును, బరిపాటియైనది గదా!

శ్లో॥ సంఘస్తు శతధా భిన్నః కుశలై స్స్వార్థకాంక్షిభిః
మర్యాదోల్లంఘనం మానం కలి కల్యాణ భోగినామ్   25

తమ లాభమునే తాము చూచుకొను నేర్పరులచే నీ సంఘమందు నానావిధము లగు భేదములు గల్పింపఁ బడుచున్నవి. ఈ కలియుగమునందుఁ బరువు ప్రతిష్ఠలు సంపాదింపఁ గోరువారలు హద్దుల నతిక్రమించుటయే గౌరవ మని యెంతురు. ఆంధ్ర ద్రావిడ భేదము, బ్రాహ్మణ బ్రాహ్మణేతర భేదము సనాతనాధునాతన భేదము, నౌత్తరాహ దాక్షిణాత్య భేదము మున్నగునవి భేదములు. వర్ణసాంకర్యము, రజస్వలానంతర వివాహము, హరిజన దేవాలయ ప్రవేశము మున్నగునవి హద్దులు దాటుట కుదాహరణములు.

శ్లో॥ అల్పప్రజ్ఞ ప్రలాపాశ్చ ఆవేశ బహుళోద్యమాః
అసంస్కృతాన్న పానాశ్చ హ్యనారాధిత దేవతాః.   26

శ్లో॥ సర్వత్ర పరిదృశ్యంతే భరతాఖ్యే మహీతలే
ప్రలయేస్మిన్ మహాఘోరే యద్య దానందదాయకమ్.  27

శ్లో॥ నష్టం తదఖిలం శిష్టా నష్టాః ప్రభ్రష్టవృత్తయః
హత మార్గం మతం సర్వం దుష్టానాం సమ్మతం మతమ్.28

నేఁడు భారతభూమియందుఁ బ్రజ్ఞలేనివారి ప్రలాపములు మెండైనవి. ఉద్యమంబు లన్నియు నధికారములేని యావేశపూరితులచే నడపఁబడుచున్నవి. అన్న పానము లాచార పూతములు గాక యున్నవి. అన్నాదివిక్రయశాలల యభివృద్ధితో నారోగ్య శాస్త్రము ననుసరించి యైన సిద్ధము

గాక పోవుటయే గాక యుచ్ఛిష్టాది సంపర్క దోషములతోఁ గూడిన పదార్థములే భోజ్యము లగుచున్నవి. గృహదేవతార్చ నలు బూజుపట్టుచున్నవి. భక్తిలేని లౌకికు లధికారులుగా నియమింపఁబడుటచే దేవాలయము లందైనఁ బూజలు సక్రమ ముగాఁ జరుగుటలేదు.

శా. పోనే పోయిన వెల్లవిద్యలును సంపూర్ణుల్ కనరారు దే వానీకంబును గుళ్లలోఁగునుకు మాహాత్మ్యంబుఁగోల్పోయి భూ జానుల్ దర్వ్యపరాయణుల్, విబుధులన్ సాకంగ నింకెవ్వరో మీనాక్షీ ! మధురాపురీనిలయ! నన్ మేలెంచి పాలించుమా!

వైద్యరాజకృత మీనాక్షి తారావళి.

ఘోరమైన యిమ్మహాప్రళయమునం దానంగదాయక మగు సర్వమును నష్టమైనది. శిష్టులకు వృత్తులు జీవనాధార ములు దొలఁగిపోయినవి. ఆర్షమతము లన్నియు హతము లైనవి. దుష్టులు సమ్మతించిన మతములే మతములుగాఁ జెల్లు చున్నవి.

శ్లో॥ గతం వీర్యం ద్విజాతీనా మన్యేషాం స్వాస్థ్య మాహతం
నతో మేరు శ్శోచన్నతశ్చ ధూమో లాఘవహేతునా. 29

ద్విజులు నిర్వీర్యులైరి. ఇతరులకు శాంతి స్వాస్థ్యములు పోయినవి. ధూమము మేరుపర్వతము తలదాఁటి పైకి పోవు చున్నది. నీచులు మహత్వము నొంది రనుట.

శ్లో॥ గతం శీలం పురంధ్రీణాం గతం స్వచ్ఛందవర్తనమ్
ఔదార్యం చ గతం రాజ్ఞాం కవీనాం గౌరవం గతమ్. 30

పాతివ్రత్యభంగకరము లగు శాసనములు ప్రబలుటచేఁ గర్మభ్రష్ట దేశములందువలెనే స్త్రీ లిచ్ఛవచ్చినట్లు సంచరింపఁ గడంగుచున్నారు. స్వదేశ ప్రభువుల కౌదార్యము పోయినది. సుకవులకు గౌరవము తగ్గినది.

శ్లో॥ కా కథా వేదాశాస్త్రాణాం ప్రబంధానాంచ కా కథా
స్వస్థాన వేష భాషాణా మాలంబో యత్ర హీయతే. 31

స్వస్థాన వేషభాషలయందే గౌరవము వీడి పరవేష భాషలకు గౌరవ మొసంగు వారలకు వేదశాస్త్రముల యందును, గీర్వాణభాషా ప్రబంధముల యందును గౌరవము తగ్గుట యాశ్చర్యమా!

శ్లో॥ కాకథా యజ్ఞతపసోః కాకథా సత్యశౌచయోః
యత్రాద్యశ్వోఽభవత్సంధ్యా హుతభుక్పర్యుపాసనా.

సంధ్యావందనము, నిత్యోపాసనమే మఱచిన వారలను యజ్ఞ తప స్సత్య శౌచములమాట యడుగనేల.

శ్లో॥ వృద్ధానాం సేవనం శ్రద్ధా విద్యానామ్ పర్యుపాసనమ్
సాధూనాం దర్శనం భక్తిర్దృశ్యతే నైవ కుత్రచిత్. 33

పెద్దలసేవయు శ్రద్ధయు సద్విద్యల నుపాసించుటయు సాధుదర్శనమందాసక్తియు, భక్తియు నేఁడును గానరాకున్నవి.

శ్లో॥ వేదోపజీవినో విప్రా హ్యథవా దాస్యజీవనాః
ఉన్మార్గస్యోపదేష్టారో దూషయంత స్స్వశేముషీమ్. 34

బ్రాహ్మణులు వేదవిద్య నమ్ముకొని బ్రతుకుచున్నారు. వారలలో గొందరు శ్వవృత్తి నవలంబించి నీచసేవలఁజేయు చున్నారు. సహజమగు తమ తెలివితేటలను దప్పుదారులను దీయుటలో నుపయోగించుచున్నారు.

శ్లో॥ సమన్వయం తు శాస్త్రాణాం నవిద్మో వేత్తికోఽనఘః
లక్షేషు దృశ్యతే కోఽపి గురుపాదార్చనారతః. 35

పైకి విరుద్ధములుగఁ దోఁచియు యథార్థముగా సమరస భావముగల శాస్త్రములయొక్క సమన్వయ మెఱిఁగిన మహాను భావు లెక్కడనున్నారో వెదకి తెలసికొన వలసిన పరిస్థితు లేర్పడినవి. దైవతములంచు గురువులఁ దలచువాఁడును, గురు పాదార్చనమందుఁ బ్రీతిగలవాఁడును లక్షలలో నొకఁడు గాన వచ్చుచున్నాఁడు.

శ్లో॥ నియమేనవినా విప్రో వినా శౌర్యేణ బాహుజః
సత్యేనచ వినా వైశ్యో వినా శౌచేన పాదజః. 36

శ్లో॥ నామమాత్రేణ జీవంతి హ్యశ్నంతిచ పిబంతిచ
దానభోగాక్షమా స్సర్వే సర్వే కలివశానుగాః. 37

నియమములేని బ్రాహ్మణులును, శౌర్యములేని క్షత్రియులును సత్యములేని వైశ్యులును శౌచములేని శూద్రులును, నామ మాత్రులై తినుచుఁ ద్రాగుచు జీవించుచున్నారు. వీరలు కలిపురుషుని చేతి యాటబొమ్మలై త్యాగమునకు భోగము నకుఁగూడఁ జాలనివారై తేజోవిహీనులై సంచరించుచున్నారు.

శ్లో॥ గోదేవ ద్విజరక్షార్థం యే సజ్యం దధిరే ధనుః
క్షత్రియా స్త్వేతరే భూపాః ఖేలం త్యధునా శ్వభిః. 38

ప్రత్యాహారమువలె మధ్యనున్న సమస్తధర్మములకు నాధారములు నాద్యంతములు నగు గోబ్రాహ్మణులను రక్షించుటకు నే రాజులు, వెలమ, రెడ్డి, కమ్మ, ప్రభృతులు ధనుర్ధరులై సిద్ధముగ నిలువంబడియుండిరో యట్టివార లిప్పుడు కుక్కలతోఁ గోళ్ళతో నాడుకొనుచున్నారు గదా.

శ్లో॥ మ్మృగ్యో ధర్మపరో రాజా చిరంజీవతు సోఽస్తిచేత్
అప్యేకో వేదధర్మాణాం గోప్తా భవితు మర్హతి॥ 39

ధర్మపరుఁడైన ఱేఁడు కానరాఁడు. అట్టివాఁడొక్కఁడున్నను వేదధర్మమును గాపాడువాఁ డగుటచే నవ్వానికి భగవంతుఁడు దీర్ఘాయురారోగ్యైశ్వర్యంబు లనుగ్రహించుగాక.

శ్లో॥ పశవోఽశ్నంతి మేహంతి సంతానం వర్ధయంతిచ
పశ్వాదిభి శ్చావిశేషా దితి శ్రీశంకరోఽబ్రవీత్. 40

పశువులుం బోలెఁ దినుచుఁ దిరుగుచు సంతతి వృద్ధిఁ జేయు నరులు పశుప్రాయు లని "పశ్వాదిభి శ్చావిశేషా" త్తని శ్రీ శంకరాచార్యులవారు తమ భాష్యమందు నుడివిరి.

శ్లో॥ కర్మభ్రష్టేషు దేశేషు జీవితం భోగవైభవమ్
రాగద్వేషపరా స్సర్వే యుద్ధసన్నద్ధబుద్ధయః. 41

భరతఖండము కర్మభూమి. తదితర దేశములు, కర్మభ్రష్టము లగు మ్లేచ్ఛదేశములు. అచ్చట జీవితము భోగవైభ

వము, అనఁగా జీవితమున కాహారనిద్రాభయ మైథునములే ప్రయోజనములు. వారికి శరీరచింతయు భౌతికభూతియే ప్రధానము. రాగద్వేషపరులై సంతతము యుద్ధసన్నద్ధులై యుందురు.

శ్లో॥ కర్మభూమౌతు జాతానాం జీవితం ధర్మవైభవమ్
ప్రాప్తవ్యం త్వాత్మతాదాత్మ్యం గురువాక్యప్రమాణతః. 42

కర్మ భూమియందుఁ బుట్టినవారికి జీవితము ధర్మవైభవము - ధర్మమే వైభవముగాఁ గలది. ఆహారనిద్రాదులుగూడ ధర్మముకొఱకే సాధించఁబడును. బ్రహ్మచింతయు, బ్రహ్మనంద ప్రాప్తియుఁ బరమార్థములు. గురువాక్యములయందు వేదవాక్యములందువలెఁ బ్రమాణబుద్ధి కలిగి యిక్కడి వారలు ధర్మార్థకామమోక్షము లను చతుర్విధ పురుషార్థములను సాధింతురు.

శ్లో॥ పిత్తరోగాభిభూతస్య తిక్తా భవతి శర్కరా
కటూని గురుసూక్తాని కలిప్రభ్రష్టచేతసామ్. 43

పిత్తరోగార్తునకుఁ జక్కెరకూడఁ జేదుగా నుండును. కలిదోషమున మనసుచెడినవారికి గురువాక్యములు కటువుగా, వెగటుగా నుండును.

శ్లో॥ ధనే నాలంబనే నాల మలం వివిధవిగ్రహైః
అలం భోగై రలం రోగై రలం చింతాశతై రపి. 44

శ్లో॥ విమానై రప్యలం యానై ర్జలాంతర్గామిభి స్త్వలం
అలం ప్రాణహరై ర్వాతై రలం నో మారకాగమైః. 45

శ్లో॥ పరస్వాహారణై శ్చాల మలంవై పరపీడనైః.
భావై ర్విసూత్నై శ్చాల మలం పాశ్చాత్త్యమారుతైః. 46

చాలు చాలీ ధనములు, సుఖారామేంధనములు చాలు చాలీ బలంబులు, పరజనపీడాకరంబులు, సంగ్రామ బహుళంబులు. చాలు చాలీ భోగంబులు రోగబహుళంబులు. చాలు చాలీ చింతాశతంబులు సంతాపకరంబులు. మా కేటికీ విమానములు, జలాంతర్గాములు, నీ మారకప్రయోగసాధకంబులగు శాస్త్రంబులు.

పరజన పరదేశ ధనాహరణంబులు వలదు. పరపీడనములు పడమటిగాలి దుమారములు వలదు. పడమట దేశములనుండి వచ్చు క్రొత్త భావములు వలదు.

శ్లో॥ "స్వధర్మే నిధనం శ్రేయ" ఇతి గీతానుశాసనమ్
భయదః పరధర్మశ్చ సర్వై రాలంబ్యతేఽధునా. 47

స్వధర్మానుష్ఠాన పరిణుఁడై చచ్చినను మేలే కాని భయావహమైన పరధర్మ మనుష్ఠింపరాదని గీతాచార్యుండగు కృష్ణభగవానుండు శాసించుచుండఁగా నేఁడందఱుఁ బరధర్మమునే యవలంబించుచున్నారు.

శ్లో॥ పరంపరేయ మంధానాం గతానుగతికో జనః
వస్తుతత్త్వం న జానంతి మేఘచ్ఛాయానుధావనాః. 48

నడిపించు నాయకులు, నడుచు ననుచరులు గ్రుడ్డివారలుగా నున్నారు. గొఱ్ఱెదాటుగా నడుచుచున్నవారే గాని

విమర్శచేయకయే క్రొత్తదారుల కెగఁబడి పరుగెత్తుచున్నారు. వస్తుతత్త్వము నెఱుఁగరు. పై మెఱుఁగులకు భ్రాంతులై గంతులు వేయుచున్నారు. నిలుకడగల వృక్షచ్ఛాయల నాశ్రయింపక మబ్బుల నీడలవెంట పరుగిడుచు నాయాసపడుచున్నారు.

శ్లో॥ అహో సంస్కార మిచ్ఛద్భిః పరదోషానుధావనమ్
క్రియతేఽజ్ఞానిభి ర్ముగ్ధై రతిక్రమ్యాప్తబోధనమ్. 49

స్వపక్ష పరపక్ష నిర్ధూమధాములై రాగద్వేషములకు లోనుగాక వస్తుతత్త్వమును సంపూర్ణముగా నెఱింగిన "యాప్తుల" యుపదేశంబుల సరకుసేయక సంస్కారమును గోరువారజ్ఞానముచే ముగ్ధులై యితరుల దోషముల ననుకరించి యనుసరించుచున్నారు కదా !

శ్లో॥ మృతప్రాయా హ్యభూద్వాణీ గీర్వాణానాం మహీతలే
ప్రాణాంత శ్చాభవ ద్రామశబ్దో మ్లేచ్ఛోపజీవినామ్. 50

జీవన్మృతు లగువారికి సంస్కృతభాషమృతప్రాయముగా నున్నది. రామశబ్దము ప్రాణాంతముగా నున్నది.

శ్లో॥ శబ్దానుశాసనై రాద్యా వైకృతంతు సుసంస్కృతమ్
సంస్కృతజ్ఞానశూన్యేభ్యః కృతంవై భాషయాఖిలమ్. 51

త్రిలింగ దేశమునందు నన్నయభట్టారకుం డనఁ బఱగిన శబ్దానుశాసనుఁ డాంధ్రభాష కాసటబీసటగాక యుండునట్లు శాసనముచేసి సంస్కృతము తెలియని సజ్జనులకై సంస్కరించి

యుండెను. ఆంధ్రభాషయందే యాతండు నాతనికి వెనుక వచ్చిన మహాకవు లందఱు సకలము నాంధ్రమునందే రచించి మేలొనర్చిరి. ఇట్లే ద్రావిడ మహారాష్ట్ర వంగాది దేశములందు నాయా చోటుల మహాకవులు దేశభాషలయందు ధర్మమును వెలయించిరి.

శ్లో॥ కాలోయం యాతి దుర్వారః కలేః స్వచ్ఛందవర్తనైః
స్త్రీ శూద్రబాలసంఘానాం ప్రభుత్వం పరిదృశ్యతే. 52

కలిపురుషుని స్వచ్ఛంద సంచారముచే నిక్కాలము దుర్వారమైనది. స్త్రీలకు బాలకులకు శూద్రులకును ప్రభుత్వము వచ్చి పెద్దలను వేదశాస్త్రములను గూడ వీరే శాసింపఁజాలియున్నారు.

శ్లో॥ భోగాపవర్గసిద్ధ్యర్థం దేవభాషా వినిర్మితా
సాధయం త్యైహికం త్వేకం, తయా తే బ్రహ్మనిందకాః.

దేవభాషయనఁగా సంస్కృతము.జనుల కిహలోకమందు సమస్తభోగములును బరమందు మోక్షము నొసంగుటకు నిర్మింపఁబడినది. అట్టి యిహపరసాధకంబగు పవిత్రవాణిని కేవలము పొట్టపోసికొనుట కెవ్వ రుపయోగింతురో వారు బ్రహ్మనిందకు లనఁబడుదురు.

శ్లో॥ యేన కేనాప్యుపాయేన జీవన్నపి కలౌ ద్విజః
బ్రహ్మాభ్యాసే సదాతిష్ఠే న్న శ్వవృత్త్యా కదాచన. 54

కలికాలమందాపద్ధర్మముగా నే యుపాయముచేత జీవించినను బ్రాహ్మణుఁడు బ్రహ్మాభ్యాసమునందే (వేదాభ్యాసమునందు=

బ్రహ్మవిద్యాభ్యాసమునందు) సర్వకాల సర్వావస్థలయందు నిలువవలయును. ఎన్నఁడును శ్వవృత్తి (సేవక వృత్తిని) నవలంబింప రాదు.

శ్లో॥ ఏకాదశో దశానాంతు మధ్యేఽర్థః కథితః పురా
ప్రయోజనానాం కావ్యానాం పరమార్థో విశిష్యతే. 55

ఇందు కావ్య ప్రయోజనముఁను వివరించు చున్నాఁడు. కావ్య ప్రయోజనములలోఁ బదింటఁ బదునొకండవదిగా (అప్రధానముగా) నర్థము (ధనము) చెప్పఁబడినది. "కావ్యం యశసే అర్థకృతే వ్యవహారవిదే..." కాని యొక్క ధనార్జనముకొఱకే గ్రంథములు వ్రాయుమని లేదు. పైపెచ్చు కావ్యములకుఁ బరమార్థమే పరమ ప్రయోజనమని పెద్దలు నిర్ణయించిరి.

శ్లో॥ వేదే దేవే గురౌ శాస్త్రే ప్రామాణ్యం పాండితీ మతా
వ్యాఖ్యానం శాస్త్రపంక్తీనాం పాండిత్యం కలిసమ్మతమ్. 56

వేదమందు, దేవునియందు, శాస్త్రమందు, గురువునందుఁ బ్రామాణ్య బుద్ధియే పాండిత్య మనుట సాధుసమ్మతము. శాస్త్రములోని వాక్యములకు వ్యాఖ్యానము సేయు కౌశలము కలిసమ్మతమైన వ్యవహారమే కాని పరమార్థము కాదు.

శ్లో॥ సర్వాంగ సుందరీం వాణీం దీక్షితాః పర్యుపాసతే
అంగకృంతనదక్షా యే వాగ్దేవ్యాః క్షోభకా స్సృతాః.

సర్వాంగ సుందరియగు వాణిని సారస్వత మంత్ర దీక్షితులు శ్రద్ధాభక్తులతో నుపాసింతురు. ప్రత్యేకాంగ విభాగము చేసి యుపాసింపఁ గడంగువారు వాగ్దేవతకు క్షోభ కలి

గించిన వారే యగుదురు. అంగవిద్య లంగివిద్యలతో సమన్వ యించు కొనఁదగునే కాని యంగాంగీభావము సమరసముగా నెఱుంగక ప్రత్యేక శాస్త్రములయందుఁ గృషిచేయుట కూడని పని యని తాత్పర్యము.

శ్లో॥ అంగైర్విరహితా వేదాః పారాయణఫలప్రదాః
గురుదీక్షాయుతా స్సర్వే నూనం నిర్వాణదాయకాః. 58

శిక్ష, వ్యాకరణము మొదలగు షడంగములు లేని వేదము పారాయణఫలము మాత్రము నీయఁగలదే కాని సంపూర్ణ ఫలప్రదము కాఁజాలదు. గురుదీక్షతోఁగూడిన వేద వేదాంగములు నిక్కముగా మోక్షము నొసంగఁ జాలి యున్నవి. క్రింద నైదు శ్లోకములలో పండితద్వేషు లగు పండితమ్మన్యుల నిరసించుచున్నాఁడు.

శ్లో॥ యేన యేన విహీనా యే తత్తన్నిందంతి తేఽధమాః
పూర్ణానాం పాతనే సక్తాః ఖనిత్రాణి గిరీ నివ. 59

శ్లో॥ పాతంజల ఖసూచి ర్యోగాభ్యాసాదే పతంజలిః
లక్ష్యలక్షణశూన్యో వై నిర్యాతి ప్రాసకః కవిః. 60

శ్లో॥ అనాచారరతా స్సర్వే హ్యవధూతపదే స్థితాః
నియమాన్ శ్లథయం త్యేతే పరివారగణా స్తయే. 61

శ్లో॥ విహాయాధికృతా న్స్నానం స్వీకుర్వం త్యనుయాయినః
ఆకర్షణంతు సంఘస్య భ్రష్టానాం మోచనం కలౌ. 62

శ్లో॥ జానంతోఽపి విరుద్ధార్థం యే వదం త్యాత్మకారణాత్
నూనం తే నిరయం యాంతి లౌకికా లోకవంచకాః. 63

ఎవని కెందులోపమో వాఁడు దానిని నిందించును. ధనము, విద్య, రూపము లేనివారలు వాని వానిని నిందింతురు. గడ్డపలుగులు కొండలను కూలద్రోయఁ గడంగునట్లు వీరు పరిపూర్ణులను బడఁద్రోయఁజూతురు అనఁగా కొండలఁ ద్రోయఁబోయిన పలుగులకు ముక్కులు విరిగిపోవును పండితుల ద్రోయఁబోయిన దుండగీడులకు ముఖభంగమగును.

పాతంజలమందు నాకసము జూచువారు (వ్యాకరణము రానివాఁడు) గ్రామ్య వాదమునందు వ్యవహార భాషాపరులై యందు పతంజలులై యాచార్యత్వము వహింతురు. లక్ష్య లక్షణము లెఱుంగని గీతిగాండ్రిందఱు యతియుం బ్రాసము లేక యేదే గతి మాత్రము నాశ్రయించి కవులయ్యెదరు అనాచారపరులగు బోధకు లందఱు నవధూతల ననుకరింతురు. స్నాన సంధ్యాది నియమములను దొలగించుటచే బెక్కురు శిష్యులు సౌకర్యమునకై యట్టివారి నాశ్రయింతురు. విమర్శచేయఁగల యధికారులను జెంతఁ జేరనీయక యాభాస గురువులు "బసవన్నా పాలు ద్రావుదువా!" యనఁ దలఁదిప్పు వారిని దఱిఁజేర్చెదరు. ఈకలికాలమందుఁ బైజెప్పినవారలకుఁ బదుగురఁ జెడగొట్టుటయే పరమార్థముగానున్నది. వైదిక సంప్రదాయము నెఱింగియుఁ దాత్కాలిక లాభములకై లౌకికులై లోకవంచనము సేయుచు నున్నదానికంటె విరుద్ధములైన యర్థములు శాస్త్రములకుఁ గల్పించువారు నరకమునం బడుదురు.

అధర్మమును దత్త్వకథనముగా వర్ణించియు "సర్వం ఖల్విదం బ్రహ్మ" యను మహావాక్యార్థము మనసునకుఁ దెచ్చికొని కవి హరిస్మరణ సేయుచుఁ జెప్పఁదలచిన యమృతసందేశము సూత్రప్రాయముగాఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ నూనం కాలో హరి స్సాక్షాత్ కాలరూపీ స్వయం కలిః
తస్మాత్కలిం నమస్కృత్య బీజగుప్త్యై యతామహే. 64

యధార్థ మారయఁగా కాలము హరిస్వరూపమే. మఱియు కలిపురుషుండు కాలస్వరూపుఁడే. నాటకములో వ్యతిరేక పాత్రలవలెఁ గలియు హరి యొనరించినవాఁడే యగుట నమ్మహనీయునకు నమస్కరించి విద్యాబీజముల విత్తనముల నిలువంబెట్టుటకై యత్నించుచున్నాము.

శ్లో॥ చతుర్వేదా షడంగాని చతుష్షష్టికలాస్తు యాః
సంరక్ష్యా జ్ఞానసిద్ధ్యర్థం తమ స్సర్వం విపర్యయే. 65

ఆర్యవిజ్ఞాన బీజసంరక్షణోపాయములు సూచింపఁబడుచున్నవి. నాలుగు వేదములు నాఱుశాస్త్రములు నఱువదినాలుగు కళలు సంరక్షింపఁదగినవి. అందే భరతఖండ విజ్ఞాన తేజమున్నది. అది లేనినాఁడు మఱే మున్న నదంతయు నంధకారమే.

శ్లో॥ ఆనంద స్త్వైక్యసంసిద్ధి స్సిద్ధయోఽన్యాస్తు మారికాః
తారికా న భవిష్యంతి తారకాపథ చారికాః. 66

జీవబ్రహ్మైక్య సంసిద్ధియం దానందమున్నది. తక్కిన సిద్ధు లెన్నియైనను చంపునవియేఁగాని తరింపఁజేయునవి కావు.

తారకాపథంబున సంచరింపఁజేయు నేటి విమానములు మొద లగు సిద్ధులు గూడ భవతారకంబులు కావు.

శ్లో॥ అత్యాపన్నోఽపి పంచాస్యో నోత్సహేత్ ఘాసఖాదనే ।
సకిర్మభూమౌ జాతా యే కర్మబాహ్యా భవంతి తే. 67

ఎంతటి యాపదలం బడియు సింగము గడ్డిదినుటకుఁ దల పడదు. కర్మభూమియందుఁ బుట్టిన ధీరులెంత యాపన్నులయ్యుఁ గర్మబాహ్యు లగుట కొల్లరు.

శ్లో॥ విజ్ఞే నైకేన నిష్పాద్యం క్రమేణ విదుషాం శతమ్ ।
యధా దీపావళి స్సాధ్యా దీపేనైకేన భాస్వతా. 68

ఒక్కదీపమున వేయిదీపములు వెలిగింప జాలినట్లు లోకబీజభూతుఁడగు విద్వాంసునిచే ననేకమంది విద్వాంసులను సిద్ధము చేయవచ్చు.

శ్లో॥ వైశిష్ట్యం త్వార్యవిద్యానాం రక్షితవ్యం సదాబుధైః।
పురుషార్థ ప్రదా హ్యేతా దదతే ద్వావివాపరాః 69

ఆర్యవిద్యలయొక్క విశిష్టధర్మము తప్పక కాపాడఁ దగినది. ఏలయన తక్కినవిద్య లర్థకామములను బోధించును. ఆర్యవిద్యలు పురుషార్థచతుష్టయ మనఁబడు ధర్మార్థకామ మోక్షము లొసంగును.

శ్లో॥ ద్వావర్థకామౌ గురుభీతిహీనా
వపేతధర్మౌ పరమార్థశూన్యౌ ।
సర్వాతిరిక్తౌ సకలార్తిహేతూ
కలేశ్శతాంగస్య రథాంగభూతౌ. 70

అర్థకామములు రెండు గురుభక్తి పాపభీతిలేనివి. ధర్మము పరమార్థము లేనివి. అన్నింటిని మించినవి. సకలానర్థములకు హేతువులు. కలిపురుషుని రథమునకే యర్థకామములు రెండును, రెండు చక్రములుగా నున్నవి.

శ్లో॥ ద్వంద్వస్య దాసస్య కుతోఽవిముక్తిః
పరోపకారాయ మనఃప్రవృత్తిః।
అన్యోన్య సంహారక యంత్రయోగే
దివానిశం గచ్ఛతి ధీప్రచారః. 71

సుఖదుఃఖాది ద్వంద్వములకు లొంగి పోయిన వానికి గాని యర్థకామములకు దాసుఁడైన వానికి గాని మోక్ష మెక్కడిది ?

అట్టివారికిఁ బరోపకారమందు చిత్తవృత్తి యెట్లు కలుగును ? ఒకరినొకరు చంపుకొను యంత్రములను నిర్మించుట యందే రేఁబవళ్ళు బుద్ధి వారికిఁ బ్రసరించు చుండును. ఇప్పట్లనేటి రాక్షసయుద్ధములే తార్కాణములు.

శ్లో॥ వేదే ప్రమాణే సతి ధర్మరక్షా
వేదేఽప్రమాణే సతి సా కథం స్యాత్ ?
స్వపక్షరక్షా ఖలు సాధకానామ్
ఫలం కలౌ భాషిత మగ్రగణ్యమ్. 72

వేదమును బ్రమాణ మని నమ్మిననాఁడే ధర్మమునకు రక్ష కలదు. వేదమునందే ప్రమాణ బుద్ధిలేని నాఁడెక్కడి ధర్మము ? ఈ కలియుగమందు మహాత్వము బొందు వారందఱు

స్వధర్మమును వీడి స్వపక్షమును మాత్రము రక్షించుకొందురు.
అదియే యుత్తమఫల మని వారందురు.

శ్లో॥ సర్వేజనా స్సంతు సుఖేన నిత్యమ్
పురా యదుక్తం గురుభి స్సహర్షమ్
సంత్యజ్య త త్స్వీయవివృద్ధయేఽలమ్
స్వపక్షరక్షా క్రియతే ప్రలుబ్ధైః 73

మున్ను పెద్దలు, సంతోషముతో నిత్యము సర్వజనులు సుఖపడుదురు కాక యని చెప్పుచున్న మాట కాదని నేటి కాలమున ధనాధికార లుబ్ధులు తమతమ వృద్ధిని మాత్రము గోరిన వారై ధర్మము నావల నెట్టి తమ తమ పక్షములను మాత్రము రక్షింతురు.

శ్లో॥ అస్మాదృశా యేతు సమానభావా
భవంతు తే ధర్మవివర్ధకా నః
యేషాం హృదిస్థం కలికృత్యజాతమ్
సరంతు తేఽస్మాన్ పరిముచ్య దూరాత్. 74

మాతో నేకీభవించిన వారు మావంటివారు మాకు తోడై, మాధర్మమును పెంపొందించిన చాలును. కలిపురుషుని కృత్యము లెవరికి బాగని తోచునో వారు మమ్ము మాపనిలో వదలి మా కడ్డమురాక దూరముగాఁ బోవుదురు కాక !

శ్లో॥ వ్యర్థం స్వధర్మేణ వినా స్వరాజ్యమ్
ఖిలం స్వరాజ్యం త్వఖిల స్వధర్మః
ఆసేతు శీతాచల మేకధర్మః
పృథక్ స్వరాజ్యాని బహూని ఖండే. 75

స్వధర్మములేని స్వారాజ్యము వ్యర్థము. స్వారాజ్యము నశ్వరమైనది. స్వధర్మము శాశ్వతమైనది. ఆసేతుశీతాచల మంగ వంగ కళింగాది దేశములయం దెన్నియో స్వారాజ్యము లుండెడివి. స్వధర్మ మన్నింట నొక్కండే. అశ్వపతివారి యోగము బయటబడిన వారు సమ్రాట్టులు. గజపతి వారి యోగము బయటపడిన వారు సమ్రాట్టులైరి.

శ్లో॥ గచ్ఛంతు రాజ్యాని నృపాలవంశా
స్సద్భి స్స్వధర్మః పరిరక్షణీయః
వేదాః పురాణాని కలా స్సమస్తా
స్సదా బుధారాధన భాజనాని. 76

రాజ్యములు పోయినను, రాజవంశములు పోయినను, బోవుఁగాక. సత్పురుషులు స్వధర్మము మాత్రము రక్షించుచుండుదురు వేదములు, పురాణములు, సమస్తమైన కళలు సదా బుధారాధనమునకుఁ బాత్రములు.

శ్లో॥ వినోదాయ వివాదాయ విత్తాయాహో ప్రకల్పతే
నవిజ్ఞానాయ విద్యైషా విప్రాణాం వదనే కలా. 77

ఇక్కలికాలమందు విప్రులవదనమునందున్న విద్య వినోదనమునకో విత్తార్జనమునకో వినియోగపడుచున్నది కాని విజ్ఞానము నొసంగుటలేదు.

శ్లో॥ దినేదినే గురుం దేవం త్రిసంధ్యం వేదమాతరమ్
తద్దినేచ పితౄన్ విప్రః పూజ్యో భవతి పూజయన్. 78

ప్రతిదినము గురుదైవతములను బూజించువాడు త్రికాలములయందు గాయత్రి నుపాసించువాఁడు, శ్రాద్ధమునాడు బర్వదినములయందుఁ బితృదేవతలఁ దర్పణమొనర్చువాఁడు నగు బ్రాహ్మణుఁడు పూజ్యతను బొందును.

శ్లో॥ స్వధర్మేణ సమో ధర్మో న భూతో న భవిష్యతి
అంగత్వే నాన్యధర్మోఽపి విపత్కాలే విధీయతే. 79

స్వధర్మమునకు సాటియగు ధర్మము వెనుక లేదు. ముందుండఁబోదు. స్వధర్మ మంగిగా నున్నపు డంగముగా నితర ధర్మములుకూడ విపత్కాలమందు నాపద్ధర్మముగా విధింపఁబడుచున్నవి. అంతటి పాండవులు విపరీతకాలమున విరటుని గొల్చియుండిరి. అట్లయ్యు వారి స్వధర్మమును వారు వీడరైరి.

శ్లో॥ న హ్యాత్మసదృశం వస్తు తత్కామా యాఖిలం ప్రియమ్
సర్వం తత్ప్రాపకం గ్రాహ్యం తద్విరుద్ధం పరిత్యజేత్. 80

ఆత్మసమమగు వస్తువులేదు. ఆత్మకొఱకు సకలము ప్రియమగుచున్నది. కాబట్టి యాత్మప్రాపకంబగు సర్వంబు గ్రహించునది. ఆత్మ వ్యతిరిక్తమగు సకలముఁ బరిత్యజించునది.

శ్లో॥ ఆత్మవిద్యా పరా విద్యా త్రిషు లోకేషు దుర్లభా
కర్మభూమౌతు సా లభ్యా బ్రాహ్మణ స్తత్ప్రకాశకః. 81

ఆత్మవిద్యకంటె గొప్పవిద్య ముల్లోకములయందుదొరుకదు. కర్మభూమియందు జనన మందిన వారి కది సులభము. బ్రాహ్మణు లా విద్యను బ్రకాశింపఁ జేయువారు.

శ్లో॥ కులక్రమాగతత్వాచ్చ వైశేష్యా దీశ్వరేచ్ఛయా
బ్రాహ్మణో బ్రహ్మవిద్యాయాం గురుర్భవితు మర్హతి 82

వంశ పరంపరగా వచ్చుచున్నవి. శేష ముండుటయు, నీశ్వరేచ్ఛ యట్లుండుటయు, బ్రాహ్మణుని బ్రహ్మవిద్యకు గురువునుగాఁ జేసెను.

శ్లో॥ జాతిమాత్రేణ యో విప్రః పూజ్యో భవితు మిచ్ఛతి
పరిత్యజ్య స్వకం ధర్మం పరిహాసాయ కల్పతే. 83

స్వధర్మమును విడిచి జాతిమాత్రముచేతనే పూజింపఁబడవలె నని యే బాపఁడు కోరునో వాఁడు పరిహాస పాత్రుఁడగును.

శ్లో॥ బ్రాహ్మణం పూజయన్ భక్త్యో బ్రహ్మభావేన పుణ్యభాక్
భావనా సదృశీం సిద్ధిం ప్రాప్నో త్యేవ న సంశయః. 84

బ్రహ్మభావముచేత భక్తితో బ్రాహ్మణునే పుణ్యాత్ముఁడు పూజించునో యాతఁడొకింత సందియము లేక భావనకుఁ దగిన సిద్ధినిఁ బొందుచున్నాఁడు.

శ్లో॥ ఏకలవ్యేన విజ్ఞాతం పరమం భావనాఫలమ్
మృత్పిండో ద్రోణతా మేత్య యస్యాదా ద్విజయే జయమ్.85

మంటిముద్ద ద్రోణాచార్యుఁడై యే మహనీయునకు విజయుని జయింపఁజాలు విద్య నొసంగెనో యట్టి యేకలవ్యుండీ భావన యొక్క పరమప్రయోజనమును గాంచెను.

శ్లో॥ సర్వసిద్ధికరీ విద్యా భావనా పరికీర్తితా
తద్వా న్విద్వా నహో నాన్య స్తస్మై వాస్తి గురో హరిః.

భావన సర్వసిద్ధిప్రదమగు విద్యయని పెద్దలుచెప్పుదురు. అట్టి భావన కలవాఁడే పండితుఁడు. మఱియొకండు కాఁడు. అట్టి భావనకలవానికి వెదుక నక్కఱలేకయే గురునందే హరి కలఁడు. అనఁగా గురువును సేవించినమాత్రమున హరిని సేవించిన ఫలము వచ్చుననుట.

శ్లో॥ భావనాయాః ఫలం గుహ్యం సుశీలాః పతిదైవతాః
దమయంత్యాదయః ప్రాపుః ప్రభావం ముని దుర్లభమ్.

భావనాశక్తికిం గల ఫలము పరమరహస్యమైనది. అది యెల్లఱకెఱుంగఁబడదు. పతియే దైవతమని భావించి సేవించిన సుశీలలు దమయంతి మొదలగు పతివ్రతాశిరోమణులు మునులకుఁగూడ దుర్లభంబగు శాపానుగ్రహ సామర్థ్యము కలిగి యుండలేదా?

శ్లో॥ అస్తు మాస్తు ఫలం కించి ద్విప్రాణాం పూజనే ధ్రువమ్
బ్రహ్మద్వేషీ యుగాంతేపి బ్రహ్మజ్ఞానం నవిందతే. 88

బ్రాహ్మణులను బూజించుటచే ఫలముండనీ, లేక పోనీ, బ్రహ్మద్వేషిమాత్రము యుగాంతమునందైన బ్రహ్మజ్ఞానము సంపాదింపఁజాలఁడు.

శ్లో॥ వ్యవహారే వివాదాయ వర్ణభేదః ప్రతిష్ఠితః
సాంకర్యం వర్ధతే నూనం కలౌ కలివిజృంభణాత్. 89

ఇక్కాలికాలమందు బ్రహ్మక్షత్రియాదిభేదము వ్యవహారమునందుఁ బోరాడుటకే వినియోగపడుచున్నది కాని వర్ణా

శ్రీమ ధర్మ నిర్వహణముకొఱకు గాదు. యథార్థముగా వర్ణ సాంకర్యమే వృద్ధిచెందుచున్నది.

శ్లో॥ పురార్జిత తపఃపుణ్యై స్సూతాద్యా మునిపూజితాః
విప్రవిద్వేషిణో నైతే యథాద్యప్రతిపాద్యతే. 90

పూర్వపుణ్యావశమున సూతుఁడు మొదలగువారు మునులచేఁ బూజింపఁబడిరే కాని వారు నేఁడందఱుఁ జెప్పుకొన్నట్లుగా బ్రిహ్మద్వేషులు కారు.

శ్లో॥ అహంకారపరా విప్రాన్ పరం నిందంతి పాదజాః
జిజ్ఞాసవో ననిందంతి గురుసందర్శనోత్సుకాః. 91

అహంకారపరులైన శూద్రులు బ్రాహ్మణులను మిక్కిలి నిందింతురు. గురువుల దర్శింప నుత్సహించువారు శూద్రులైనను నిందింపరు.

శ్లో॥ అద్యాపి సాధవ స్సంతి సర్వవర్ణేషు సాధకాః
సిద్ధిమంతో ననిందంతి సర్వే స్సంపూజితాస్తు తే. 92

ఇప్పటికైనను సమస్త వర్ణములయందు సాధువులైన సాధకు లున్నారు. సిద్ధిబడసినవారు నిందింపరు. పైపెచ్చు వారెల్లరచేఁ బూజింపఁబడుదురు.

శ్లో॥ ఖట్వారూఢో ననిద్రాతి చింతా మత్కుణకారణాత్
సుఖం నిద్రాత్యథశ్శాయీ కర్షకః కామవర్జితః. 93

చింతలచే, మత్కుణములచే మంచమెక్కి పరుండినవాఁడును నిద్రింపఁజాలఁడు. కష్టజీవియగు కాపువాఁడు కామరహితుఁడై నేలపైఁ బరుండియు సుఖముగా నిద్రించును.

శ్లో॥ గురౌ యో లీయతే భక్తశ్చాండాలో వాథ సద్విజః
సర్వధర్మాన్ పరిత్యజ్య స ఏకో ముచ్యతే ధ్రువమ్. 94

సర్వధర్మములు పరిత్యజించి గురువునం దెవ్వఁడు లీన మగునో యట్టి భక్తుఁడు చండాలుఁడైనను, బాపఁడైన నాతఁ డొకఁడే జన్మసంసార బంధమునుండి ముక్తుఁడగును.

శ్లో॥ యే గురూ న్నాభిగచ్ఛంతి పోషయంత స్త్రివాసనాః
పరమార్థం నవిందంతి శ్రవణే శ్రావణేపివా. 95

వాసనాత్రియమును బెంపొందించుకొనుచు గురుసన్నిధానమున కెవరు పోరో యట్టివా రెన్ని శ్రవణములు చేసినను బరులకుఁ జెప్పినను బరమార్థము నించుకేనియుఁ గాంచలేరు.

శ్లో॥ ప్రత్యక్షే ణోపలభ్యోపి న దృష్టో యేన సద్గురుః
ఆత్మానం స కథం పశ్యే దవాఙ్మానసగోచరమ్. 96

ప్రత్యక్షముగా నింద్రియగోచరుండగు సద్గురుమూర్తి నే చూడలేని మొద్దు లవాఙ్మానసగోచరుండగు నాత్మ నెట్టు చూడఁగలరు.

శ్లో॥ సవ్యాపారా ణీంద్రియాణి నిర్వ్యాపారం గురూదరమ్
తదేతైః పోష్యతే కిం న బ్రాహ్మణః కిం న పోష్యతే. 97

ఇంద్రియములు వ్యాపారముకలవి. గురూదరము, పెద్దదైన యీ కడుపు వ్యాపారములేనిది. అట్టులయ్యు నీకరచరణాదులచేత నీకడుపు పోషింపఁబడుచున్నదా లేదా? బ్రాహ్మణుఁ డెందుకుఁ బోషింపఁబడఁడు.

శ్లో॥ ఉత్తమాంగస్య వైకల్యే సర్వాంగం వికలం భవేత్
బ్రాహ్మణస్యతు వైకల్యే సకలం వికలం భవేత్ 98

తలలోఁ దెగులు పుట్టిన నది సర్వాంగములం దగులును. బ్రాహ్మణుఁడు వికలుఁ డయ్యేనేని సంఘము సకలము వికల మగును.

శ్లో॥ చికిత్స్యో బ్రాహ్మణో హ్యేకో హ్యచికిత్స్యాః పరేజనాః
నిరామయో యదా విప్రో జగత్సర్వం నిరామయమ్. 99

బ్రాహ్మణుఁ డొక్కఁడే చికిత్స చేయఁదగినవాఁడు. తక్కినవారు చికిత్సచేయఁబడఁ దగరు. బ్రాహ్మణుఁ డెప్పుడు నిరామయుఁ డగునో జగ మంతయు నప్పుడు నిరామయం బగును.

శ్లో॥ బ్రాహ్మణానా మనేకత్వ మస్తు నామ బలీ కలిః
ప్రకృతే ర్బీజధర్మిత్వాత్ జ్ఞానబీజ మనశ్వరమ్. 100

బ్రాహ్మణులలో ననేకత్వముండుగాక, కలి బలవంతుఁ డగుగాక, ప్రకృతి బీజధర్మిణి యగుటచే జ్ఞానబీజము నాశరహిత మైనది.

శ్లో॥ శిష్టం యచ్ఛిష్టబృందం చావశిష్టం విదుషాంగణమ్
కలా శ్శిష్టాశ్చ శాస్త్రాణి శిష్టాని పరిరక్షయేత్. 101

మిగిలిన శిష్టబృందము, శేషించియున్న విద్వద్బృందము, ప్రాణావశిష్టమైన చతుష్షష్టికళలు, చిక్కియున్న శాస్త్రములు రక్షింపఁదగినవి.

శ్లో॥ నూనం ధర్మం నజానాతి య ఆయవ్యయ మీక్షతే
సత్యే నష్టే దయానాశే కర్మభూ ర్మ్లేచ్ఛభూ ర్భవేత్.102

లాభనష్టములను మాత్రము చూచుకొనువాఁడు నిక్కముగా ధర్మ మెఱుంగనివాఁడే దయాసత్యములు నశించినచోఁ గర్మభూమి యగు మన భారతదేశము మ్లేచ్ఛభూమి యగును.

శ్లో॥ సత్యశౌచవిహీనాచ తపస్స్వాధ్యాయవర్జితా
కర్మభూ ర్ధర్మలోపేన విజ్ఞానేన విహీయతే. 103

సత్యదయాశౌచవర్జితమును, తపస్స్వాధ్యాయరహితంబు నగు కర్మభూమి ధర్మలోపముచే జ్ఞానహీన మగును.

శ్లో॥ యస్సినాధయిషూ రాజ్యం ధర్మాపేతం స మూఢధీః
అలంకరిష్ణుః కుణపం మణిమాలా విలేపనైః. 104

ధర్మములేని రాజ్యలబ్ధిని సాధింపఁ గడంగు మూఢుండు నిజముగా శవమును మణిమాలావిలేపనాదులచే నలంకరించిన వాఁడగును.

శ్లో॥ లోభక్రోధా లాభనాశౌ భోగరోగా జనిర్మృతిః
సామాన్యం సర్వజంతూనాం ధర్మ ఏకో విశిష్యతే. 105

లోభక్రోధములు లాభనష్టములు భోగరోగములు జననమరణములు సర్వజన సామాన్యంబులు, సాధువులందు ధర్మ మొక్కఁడు విశేషముగా నుండును.

శ్లో॥ ధర్మో ధర్మః కర్మభూమౌ వర్థకామౌ తదన్వితౌ
మోక్షస్య సాధకత్వేన త్రివర్గః పరికీర్తితః. 106

కర్మభూమియందుఁ బుట్టిన వారలకు ధర్మసంపాదనమే ధర్మము, అప్పుణ్యాత్ముల కర్థకామములుగూడ ధర్మసమన్వితంబులే. పరంపరగా నీ త్రివర్గము మోక్షమునకు సాధనమగుచున్నదని పెద్దలు కీర్తింతురు.

శ్లో॥ యచ్చాదృష్ట మపూర్వం యద్వేదమానం బుధోచితమ్
అపవర్గప్రదం కర్మ కర్మభూ ర్యత్రదృశ్యతే. 107

మున్నెన్నఁడు చూడఁబడనిదియు, వేదమే ప్రమాణముగాఁ గలిగినదియు, బుధుల కుచితంబగునట్టిదియు, మోక్షప్రదమగు నట్టిదియు నగు కర్మ మెందుఁ గానవచ్చు నదియ కర్మభూమి యనం బరగు.

శ్లో॥ భువ్యేకదేశమాత్రైవ కర్మభూః కర్మవర్జితా
జన్మభూ రుదభూమిశ్చ కీటానాంచ కరీషవత్. 108

కర్మవర్జితమైన యీ దేశము భూమండలమందు పేరులేని పెద్ద పల్లెవంటి దగును, కాని పుట్టిచచ్చు పురుగులకుఁ బేడవలె నీ నేల కర్మభ్రష్టులకు జన్మభూమియు రుదభూమియు నగుటకు సందేహము లేదు.

శ్లో॥ తృణీకృత సురజ్యేష్ఠా ఆసతే యత్ర భూసురాః
దిగధీశాధికో యత్రనృపాలోఽభూత్స్వయంవశే. 109

శ్లో॥ ఆభ్యంతరాణి తీర్థాని యత్రసేవ్యాని బాహ్యతః
కర్మభూమిస్తు సా జ్ఞేయా జని ర్యత్ర సుదుర్లభా. 110

ఈ కర్మభూమియందుఁ బుణ్యాత్ములు పుట్టుదురు. త్రిణే కృత బ్రహ్మపురందరులైన బ్రాహ్మణోత్తముల కిది పుట్టినిల్లు. దిక్పతులకంటె నీ కర్మభూమిలో నుదయించిన రాజొకఁ డధికుఁడని స్వయంవరంబున నొకరాచకన్యచే వరింపఁబడెను. ఇం దాభ్యంతర తీర్థము లన్నియు బాహ్య తీర్థములుగా గంగాది నదులుగా సేవింపఁబడుచుండును.

శ్లో॥ కలౌ కలిప్రభావేన రాజధర్మ ప్రవర్తకాః
కర్మభ్రష్టాః పరే స్వీయాః కథం ధర్మః ప్రవర్ధతే. 111

ఇట్టి పవిత్రమగు కర్మభూమియందుఁ గలి ప్రభావముచేత రాజధర్మ ప్రవర్తకులు పరులు స్వీయులుగూడ కర్మభ్రష్టులై పోవ ధర్మ మెట్లు వృద్ధిఁబొందఁగలదు. ఇందు పరు లాంగ్లేయులు. స్వీయులు సంఘమత మర్యాదా భంజకు లగు సంఘ సంస్కర్తలు.

శ్లో॥ స ఏక స్తారకో భూయా ద్ధియో యో నః ప్రచోదయాత్
ధర్మవిజ్ఞాన బీజానాం రక్షాయై ప్రళయేఽధునా. 112

బుద్ధుల నన్నిటినిఁ బ్రచోదనము చేయు నొక భగవంతుఁడే యీ మహాప్రళయమందు ధర్మ విజ్ఞాన బీజములను గాపాడుకొనఁ గడంగు మాకుఁ దారకుం డగుఁగాక.

శ్లో॥ స ఏక స్తారకో భూయా త్తారకాసురమారకః
మారాంతక కుమార ష్షణ్మాతురో నేతరో జనః. 113

తారకాసుర మారకుం డగు మారాంతకుని కుమారుం

డగు కుమారుం డొక్కఁడే మాకుఁ దొరకుండగుఁ గాని యిత రుండు కాఁజాలఁడు.

శ్లో॥ వీతరాగ భయక్రోధా వి త్తేషణ వివర్జితాః
విజ్ఞా జిజ్ఞాసవ స్తజ్ఞాః ప్రశస్తా ధర్మగోపనే. 114

రాగ భయ క్రోధము లడంగినవారు, ఏషణత్రయ వివ ర్జితులైనవారు, విజ్ఞులు, జిజ్ఞాసువులు, తజ్ఞులు, ధర్మరక్షణ మందు ప్రశస్తులు.

శ్లో॥ అగః పుష్ణాతి పంచాంగం స్వస్థానే స్వవశే వసన్
సపంచాంగో వశీ విప్ర స్స్వాస్మృత్తౌ కిం న పోష్యతే. 115

వృక్షము తానున్నచోటు వీడక పరుల నాశ్రయించఁ బోక పంచాంగములతోఁ గూడిన తన శరీరమును దాను పోషించు కొనుచున్నది. పంచాంగ బలసంపన్నుఁడై యింద్రియ జయము గలిగిన విప్రుఁడు దన వృత్తిలోఁ దాను బ్రతుకలేఁడా!

శ్లో॥ మహారాజశ్రియం త్యక్త్వా శ్రియం బ్రాహ్మీం పరిత్యజన్
లౌకికీం శ్రియ మాకాంక్షన్ కదన్నస్స్యా ద్ద్విజాధమః 116

ద్విజులు రాజపోషణ లేక మహారాజశ్రీ గోలుపోయిరి. బ్రహ్మవిద్యల నేర్వక బ్రహ్మశ్రీ గోలుపోయిరి. అధమద్విజులు శ్వవృత్తినిఁ బూని దురన్నభక్షకులై లౌకికమైన శ్రీ (సంపద) మాత్రము ధరించుచున్నారు.

శ్లో॥ ఉపాసతే గురుం దైవం యే భక్త్యా ధర్మసేతవః
తపవాధికృతా నూనం జ్ఞానబీజస్య గోపనే. 117

ధర్మసేతువులై యెవరు భక్తితో గురుదైవముల నుపా సింతురో నిక్కముగా వారలే జ్ఞానబీజరక్షణ చేయుట కథకారు లగుదురు.

శ్లో॥ ఉదరంభరయో జాతా హాకష్టం నిగమోదరాః
దాసభూతాః కలౌ విప్రా దాసభూతమహీంభుజః. 118

నిగమోదరులు కడుపునిండ వేదముగలిగిన బ్రాహ్మణు లక్కటా నేఁ డుదరంభరు లనఁగాఁ బరమార్థశూన్యులై పొట్టఁ బోసికొనువార లైరిగదా! ఎవరియొక్క సుగుణసంపద కోడి రాజులు దాసభూతులైరో యట్టి విప్రులు నేఁడు దాసభూతు లైరి.

శ్లో॥ యజ్ఞశిష్టాశినో విప్రా నిస్పృహాశ్చ ధనార్జనే
తపస్స్వాధ్యాయనిరతాః కిం భవేయు ర్నభూసురాః. 119

దేవతలను బూజించి శేషించిన పదార్థములను దిను వారును ధనార్జనమందు నిస్పృహులైనవారును దపస్స్వా ధ్యాయనిరతులైనవారును భూసురు లేల కారు.

శ్లో॥ విద్యుద్భిశ్చ విమానైశ్చ విక్రమై రక్రమై రహో
జయత్వద్య నవం శాస్త్రం మనఃక్షోభక మంతతః 120

శ్లో॥ ఆకాశభాషితై ర్గానై ర్దూరదర్శనసాధనైః
జయత్వద్య నవం శాస్త్రం మనః క్షోభక మంతతః. 121

శ్లో॥ వార్తాభి ర్మదిరైత్రై ర్గ్రంథై శ్ఛాయాసంగ్రాహకైః పటైః
ఫలకై ర్నాదగర్భైశ్చ శాంతి మృచ్ఛతి నో జనః 122

శ్లో॥ అస్తు నూతనశాస్త్రాణా మాపాత మధురంఫలమ్
మధులిప్తాసిధారాణాం లేహనం తన్ని షేవణమ్. 123

ఈ విద్యుద్దీపములు నీవిమానములు యెగురుట లీదాటు టలు క్రొత్త శాస్త్రములు సర్వోత్కృష్టములుగాఁ దోఁచినను దుదకు దుఃఖమునః దెచ్చి పెట్టునవియే. ఆకాశ భాషితములు (రేడియో) గానములు, దూరదర్శన సాధనములు నాపాత మనోహరములుగా నున్నను మనః క్షోభకములే, వార్తా పత్రికలు, ముద్రిత గ్రంథములు, సినీమాలు, గ్రామఫోనులు, మొదలగు వానివలనఁ జిత్తశాంతి లభింపకున్నది. పై మొత్తముఁ గుగా నూతన శాస్త్ర ఫలితములు దోఁచినను విచారింపఁగా నవి యన్నియుఁ దేనె పూసిన కత్తిని నాకుటవంటివే.

శ్లో॥ మిథ్యాయోగాతియోగాభ్యా మయోగేన విషం ఫలమ్
తస్మాత్సర్వస్య విజ్ఞైర్వై సమ్యగ్యోగో విధీయతే. 124

ఉండవలసినవానికంటె వేరుగానుండుట,నుండవలసినదాని కంటె నెచ్చుగా నుండుటయు,నుండవలసినదానికంటెఁ దక్కువగా నుండుటయు విపరీత ఫలము నొసంగును. ఇవియే మిథ్యాయోగము, అతియోగము, అయోగ మనఁబడును. కాబట్టి సర్వ విషయములయందు సమ్యగ్యోగము విధింపఁబడినది. ఋతు ధర్మములు తారుమారగుట లోకమున నింద్రియ ధర్మములలో సమ్యగ్యోగము లేక లోలత్వమున మిథ్యాయోగాదులచే విపరీతఫలముఁ బొందుట తగనివని యనుట.

శ్లో॥ మంత్రో యంత్రంచ యోగశ్చ సమ్యగ్యోగే ఫలప్రదాః
ఏతేన యోగః ప్రత్యుక్త ఇత్యాహు రతివర్జనే. 125

మంత్రముగాని యంత్రముగాని సమయోగమునందు సత్ఫలము నొసంగును. ఆమంత్రయోగములు పరమార్థ రహితములుగాఁ బ్రయోగింపఁబడినవై విపరీత ఫలము నొసంగును. కాబట్టియే కేవలమగు యోగమును ఖండించుచు "ఏతేన యోగః ప్రత్యుక్తః" అని పెద్దలు చెప్పినారు.

శ్లో॥ చిత్తశుద్ధికరం కర్మ కర్మఠో నైవ తత్త్వదృక్
మననా త్త్రాయతే మంత్రో మాంత్రికో నైవ తత్త్వదృక్.

కర్మము చిత్తశుద్ధిని జేయుట నిక్కమే. కాని కర్మజడులకుఁ దత్త్వదృష్టి కలుగదు. మననము చేయువానిని మంత్రము రక్షించును. కాని మంత్రముల నేర్చి క్షుద్రప్రయోగములఁ దగులు మాంత్రికుఁడు తత్త్వ దృష్టికలవాఁడుకాఁడు.

శ్లో॥ తాంత్రికో మాంత్రికో యోగీ కర్మఠో యో నతత్త్వదృక్
ముగ్ధానాం వంచకో నూనం భక్తానాం నైవ తారకః. 127

తాంత్రికుఁడు గాని మాంత్రికుఁడుగాని యోగిగాని కర్మఠుండుగాని యెవ్వఁడు తత్త్వదృష్టిఁ దాల్పలేఁడో వాఁడు నిక్కముగా నమాయికులను వంచించువాఁడగును, కాని భక్తులకుఁ దారకుండు కాజాలఁడు.

శ్లో॥ అంతరాయ ధియా దృష్టా స్తత్త్వజ్ఞై రష్టసిద్ధయః
భవేయుః కిం న తాః పీడా నవీనక్షుద్రసిద్ధయః. 128

తత్త్వజ్ఞులు తమకుఁ దమంత వచ్చిన యష్టసిద్ధులు(అణి మాదులు) పరమార్థమునకు విఘ్నకరములుగా నెంచి విసర్జించిరి. నేఁటి క్షుద్రసిద్ధులు పీడాకరము లగుట కేమి సందియము.

శ్లో॥ ఏకాంతో౽పి సదానంద స్తత్త్వవి త్ప్రాకృతో౽జనః
సంఘస్థో౽పి సదాదుఃఖీ సర్వసాధన సంయుతః. 129

తత్త్వవేత్త యేకాంతముగా నుండియు సదానందము ననుభవించును. సంఘములో నున్న వాఁడయ్యును పామరుఁడు సర్వసాధన సంపన్నుఁడై యుండియు సదా దుఃఖమునే యనుభవించుచున్నాఁడు.

శ్లో॥ బాహుల్య మింద్రియార్థానా మద్య శ్వః కౌశలం మతమ్
నూనం తేషాం తు వైరళ్య మార్యవిజ్ఞాన సమ్మతమ్. 130

ఇంద్రియార్థములను భోగపదార్థజాతమును వృద్ధిచేసికొనుటయే నాగరికత యనియుఁ గౌశలమనియు నేటివా రనుకొనుచున్నారు. ఆ భోగ్యపదార్థజాతమును దగ్గించుకొనుటయే పెద్దలకు సమ్మతము.

గీ॥ "చేరి భిక్షాన్న మారగించెదము మేము"
"కమనీయ భూమిభాగములు లేకున్న వే
పడియుండుటకు దూది పరుపులేల" ఇటువలెనే.

శ్లో॥ ధర్మసాధన దేహస్య క్షుచ్ఛాంతిః పారమార్థికీ
దారయోగః ప్రజాయై స్యాత్ క్రియాస్సర్వాస్తు తత్పరాః.

ధర్మ సంపాదనమునకు సాధనమైన శరీరమున కన్నపానాది విచారణయుఁ బారమార్థికమేగానఁ జేయఁదగినదియే.

భార్యాయోగము సంతానముకొఱకు. సమస్తమైన క్రియలు భగవత్పరముగా నుండవలయును.

శ్లో॥ తత్పరాశ్చ తదాత్మాన స్తదజ్ఞా స్తచ్చింతకా స్తథా
తద్విరుద్ధం నగృహ్ణీయుః పారమార్థికలోలుపాః. 132

పరమార్థమందే లోలురైన భక్తులు, తత్పరులు, తదాత్ములు, తదజ్ఞులు తచ్చింతకులై యుందురు. తద్విరుద్ధమైన దాని నెట్టిదానినైన నెట్టివేయుదురు.

శ్లో॥ సదేవ తత్త ద్విరుద్ధ మస న్మిథ్యా వృథా మృషా
తస్మా త్సర్వప్రయత్నేన తత్పరః ప్రభవే ద్బుధః. 133

సత్తే త్రికాలాబాధ్యమైనతత్త్వబ్రహ్మము. అసత్తు మిథ్య వృథాభ్రమ. కాబట్టి బుధుఁడైనవాఁడు సర్వదా తత్పరుఁడై యుండనోపు.

శ్లో॥ న విజ్ఞానప్రదా విద్యా న విత్తం ధర్మసాధనమ్
నగురు స్తారకోఽద్య శ్రో హేలయా వర్తతేఽఖిలమ్. 134

నేటికాలమున విద్య విజ్ఞానప్రదముకాదు, విత్తము ధర్మ సాధనముకాదు. గురువులు తారకులు గారు. సర్వము లీలగా వినోదముగా నడచుచున్నదే కాని తత్త్వభరితముగా లేదు.

శ్లో॥ మ్లేచ్ఛశాస్త్రం పఠంత్వార్యా మ్లేచ్ఛాచారా భవంతు తే
కామం కలికులోద్భూతా నవ్యాగమపరాయణాః. 135

శ్లో॥ ప్రామాణ్యం కల్పయం త్యద్య ప్రచుర్యేణాల్పమేధసః
కాకస్తు ప్రచురో లోకేకిం మరాళాధికో భవేత్. 136

ఆర్యులు ధర్మమును వీడి మ్లేచ్ఛశాస్త్రములు చదివి మ్లేచ్ఛాచారముల నవలంబింతురుగాక, కలికులోద్భూతులు యథే

చ్ఛముగాఁ గొత్రిత్త శాస్త్రములు చదువుదురుగాక, పదుగు రాడుమాట పాటిచేసి పండితుఁడెటేఁగి చెప్పినమాటఁ ద్రోసి వేయుదురుకాక. కాకి కెంత పాత్రిచుర్యమున్నను హంసకంటె గొప్పదికాలేదు.

శ్లో॥ వేదశాస్త్రపురాణాని సాధో రేకస్య వై బలమ్
బాహుల్యం బలహేతు స్స్యాత్ ప్రతికానీతచేతసః 137

ఒంటరివాఁడైనను సాధువు వేదశాస్త్ర పురాణములు తనకు బలముగా నెంచి జంకుమాని యుండును. పత్రికలచేత నడుపఁబడు బుద్ధిగలవారికిఁ జాలమంది సమ్మతియే బలము.

శ్లో॥ భ్రష్టానాం సముదాయస్తు పరిష న్న భవే ద్ధ్రువమ్
నిగమాగమసారజ్ఞ స్స ఏకో గురు రిష్యతే. 138

భ్రష్టుల సముదాయ మెంత పెద్దదియైన నది పరిషత్తు కానేరదు. నిగమాగమసారవేది యొక్కఁడైనను గురుండై శాసింప నర్హత కలిగి యుండును.

శ్లో॥ భాషా యోషా పరకరగతా స్వేవశే కిం న సీతా
సీతే వైషా దశముఖవృతా రామచంద్రేణ పూర్వమ్
క స్సంస్కర్తుం త్వరయతి సతీ మన్యహా స్తే కృశంతీ
మాత్మాలంబో భవ భవహరం భావయన్ దేశికేశమ్.139

భాషయను పతివ్రత పరులచేతఁ జిక్కిపోయిన దానిని సీతాదేవి రావణుని చేతినుండి వలె నేల స్వవశము చేసికొన రాదు. అట్లు చేయక పరవశయైయున్న సతికి సంస్కారములు చేయ నెంతమూఢుఁడైనఁ బ్రయత్నించునా! భవభయ భంజ

కుం డగు సద్గురుని భజించి యాత్మాలంబకుండవై యుండుము.

శ్లో॥ విరలా స్సింహశార్దూలా జ్ఞానవంతశ్చ యోగినః
వైరల్యా న్మహతాం సత్తా న కించి దపి హీయతే. 140

సింగములు, పులులు, జ్ఞానవంతులైన యోగులు లోకములో విరళముగా నుందురు. ఒంటరిగా నున్నంమువలన మహానుభావులకు సత్తువ తగ్గదు. చాలమంది యుండుటచేఁ బామరులకు బలము హెచ్చదు. ఇచ్చట బుద్ధిబలము, ధర్మబలము, వివక్షితము. పశుబలము మూకల కుండ వచ్చునుగాక.

శ్లో॥ ద్వంద్వభీతి ర్మృత్యుభీతి ర్న యేషాం హృదయాంతరే
ద్విజానాం క్షుద్భయం కస్మా ద్ధరౌ గోప్తరి పోషకే. 141

తితిక్షచే శీతోష్ణాది సమస్తద్వంద్వములనోర్చుటచే ద్వంద్వభయములేదు. దేహవ్యతిరిక్తమైన యాత్మతత్త్వ మెఱుంగుటచే మృత్యుభీతి లేదు. ఇట్టి ద్విజులకు దమ్ముఁబోషించువాఁడు హరి యుండఁగా నాకలిభయ ముండునా ?

శ్లో॥ అసంచయా నజీవంతి కిం మృగాద్యా వనాంతరే
నజీవేయుః కథం విప్రా అశ్వస్తనికవృత్తయః. 142

అడవిలో మృగములు కూడఁబెట్టుకొని బ్రదుకుచున్నవా! రేపటి చింతలేని వృత్తి కల విప్రులు బ్రదుకలేక పోవుదురా ? ఆకలివేళ కన్ని జంతువుల కన్నము దొరుకుచునే యున్నది.

శ్లో॥ యోధర్మో గురుణా ప్రోక్తః పరో ధర్మ స్స ఉచ్యతే
తం సాధయతి యో ధీర స్తం దేవా స్సాత్వికం విదుః. 143

గురువు చెప్పినదే పరమ ధర్మము. ఆగురు ప్రోక్త ధర్మమును సాధింప జాలిన ధీరుని దేవతలు తత్త్వ సంపన్నుఁ డందురు.

శ్లో॥ జీవంతి జంతవ స్సర్వే స్వధర్మావాప్తి హేతవే
యే త్యజంతి స్వకం ధర్మం జీవంతోఽపి మృతాహి తే. 144

సమస్త జంతువులు వాని వాని స్వధర్మమును బోషించుకొనుచున్నవి. సింగము గడ్డి తినదు. ఏనుగు మాంసము తినదు. స్వధర్మమును విడుచువారు బ్రదికియుండియుఁ జచ్చిన వారితో సములే.

శ్లో॥ కామం కలివశా న్మ్లానం నిస్సత్త్వోఽపి మహీసురః
నిష్ణాత స్స్వీయధర్మే య స్స దేవైః పరిగీయతే. 145

కలివశుఁడై బ్రాహ్మణుఁడు మిక్కిలి దుర్బలుఁడై యున్నను వారిలో నెవ్వఁడు, స్వధర్మ నిష్ఠుఁడై యుండునో యతఁడు దేవతలచేతఁ గీర్తింపఁబడును.

శ్లో॥ యస్మిన్ జీవతి జీవంతి బహవో ధర్మసేతవః
జీవత్యేకోహి లోకేస్మి న్నన్యే కాకా బకా వృకాః. 146

ఎవని యాధారమునఁ బెక్కుమంది ధర్మసేతువు లగు శిష్టులు బ్రదుకుదురో వాఁడే జీవించి యున్నవాఁడు. ఈ లోకమందు కాకులు కొంగలు తోడేళ్ళు నెన్ని యుండలేదు.

శ్లో॥ భృతకాధ్యాపనే బద్ధాః ప్రబుద్ధాః పండితాః కలౌ
అహో పంచాననా వ్యాఘ్రా నీయంతే కంఠరజ్జుభిః. 147

ప్రబుద్ధులైన పండితు లీ కలియుగమందు భృతకాధ్యాపకత్వమున (విద్యావిక్రయమునందుఁ) జిక్కిపోవుచున్నారు. అక్కటా! పెద్దపులులు సింగములు కంఠపాశములచే నిట్టటుఁ ద్రిప్పఁబడు చున్నవికదా!

శ్లో॥ స్వచ్ఛందచారిణో యే వై నిస్పృహా నిగమాత్మకాః
సమ్మానవిముఖా ధీరా గురవో విరలాః కలౌ. 148

నిస్పృహులు, నిగమాత్మకులు, వేదస్వరూపులు, వేదోక్తాచార వంతులు, సమ్మానమందు గౌరవమం దాసలేనివారు, ధీరులైనవారు, ఇట్టి గురువు లీ కలియుగంబునఁ గోటి కొక్కరు దొరకరు.

శ్లో॥ యత్ర యస్య మనో లీనం తత్సా్య త్తస్య గురోః పదమ్
భాష్యార్థం భాషయా బ్రూతే భృతకాధ్యాపకో హి సః.

ఎవ్వని కేచోట మనసు లీనమగునో వాని కది గురుస్థానమగును గాని భాష్యపంక్తుల కర్థమును భాషతోఁ జెప్పువాఁడు భృతకాధ్యాపకుం డగును.

శ్లో॥ యస్య దర్శన మాత్రేణ కించి దన్య న్న దృశ్యతే
స గురు స్తారకో భూయా దీశ్వరానుగ్రహాకృతిః. 150

శ్లో॥ అంతరంగదృశా జ్ఞానం లభతే యస్య దర్శనాత్
స గురు స్తారకో భూయా దీశ్వరానుగ్రహాకృతిః. 151

ఏ మహానుభావుని దర్శన మైనంతమాత్రనే మఱి యితరమేమియుఁ గానరాదో యట్టివాఁ డీశ్వరానుగ్రహంబున

లభించును. ఎవని దర్శన మాత్రమున నంతరంగదృష్టియు జ్ఞానము గలుగునో యాతండే తారకుఁడు.

కం. ఏ నరుగాంచిన లోకము
లో నెద్దియుఁ గానరాదు లో చూపున వి
జ్ఞానము కలుగునో యాతం
డా నాచార్యుండు సర్వమా హారి కృపచేన్,"
(కనకాంబాకృత జీవయాత్ర)

శ్లో॥ గురోర్హస్తేచ చిత్తేచ కటాక్షే తస్య ధీమతామ్
సిద్ధిర్వినిహితా ధాత్రా కిమన్యత్ర విమృగ్యతే. 152

ధీమంతులకు సద్గురుమూర్తి హస్తమునందుఁ జిత్తము నందుఁ గటాక్షమునందు సిద్ధిని బ్రహ్మ నిక్షేపించియుండఁగా వేయిచోట్ల మూఢులు వెదకుదురేల.

శ్లో॥ వేదశాస్త్రపురాణాని కావ్యాని వివిధానిచ
పరమార్థప్రాపకత్వా చ్ఛిష్టగ్రాహ్యాణి సర్వదా 153

వేదశాస్త్రపురాణములు, వివిధములైన కావ్యములును బరమార్థమును బోధించునవి గాన శిష్టు లవ్వానినిఁ బరిగ్రహింతురు.

శ్లో॥ ఔత్సుక్యాద మసత్కావ్యం వర్జయే త్పారమార్థికః
అసాధుత్వా మనార్షత్వా త్సంపత్కావ్యస్య కాకవేః. 154

అసత్కావ్యములు విషయోద్రేకమును గలుగఁజేయును గానఁ బారమార్థికు లవ్వానిని వర్జింతురు. నానృషిః కురుతే కావ్య మ్మను 'మాటకు ఋషి కానివాఁడు కావ్యరచన సేయఁ

డనుటలో సత్కావ్యరచన సేయఁడని యర్థముకాని యసత్కావ్యరచన చేయఁడని యర్థము కాదు. కాన ఋషులుకానివా రసత్కావ్యమ్ములను రచింతు రనుట సుగమము. ఋషికృతకావ్యములలో నెటనేని దోషముండిన "ఆర్షత్వా త్సాధు" వని యందురు. అనఁగా ఋషు లగుటచేత వారి యపప్రయోగముగూడ మంచిదిగానే గ్రహింప వలయు ననుట. అసత్కావ్యకర్తలు ఋషులుగారు గనుకఁ గుకవులములు కసాధుత్వమే సంపత్తు.

శ్లో॥ వాల్మీకిః కాళిదాసశ్చ యే చాన్యే కవయః పురా
ధర్మమేవ పరం ప్రాహు స్స్వకైః కావ్యై ర్మనోహరైః.

తొల్లింటి కవీశ్వరులు వాల్మీకి కాళిదాసాదులు మనోహరమైన తమకావ్యములలో ధర్మమే శ్రేష్ఠ మని ప్రతిపాదించిరి.

శ్లో॥ సమర్థయతి దుర్వృత్తాన్ స్వకావ్యే ష్వధునాతనః
విషాదాంతాని తానిస్యూ రసాభాసాని సర్వతః. 156

నేటివారు కొందఱు తమ క్రొత్త కావ్యములలో దుర్యోధనరావణాది దుర్వృత్తుల సమర్థింతురు. కొందఱు తమ కావ్యములను విషాదాంతములుగ రసాభాసబహుళంబుగ నొనరింతురు.

శ్లో॥ పరిత్యక్తవ్యతాబుద్ధ్యా హ్యధర్మః ప్రతిపాదితః
పరిగ్రాహ్యతయా పూర్వై ర్ధర్మోఽపి ప్రతిపాదితః. 157

మన పూర్వులు పరిహరించుటకుగా నధర్మమును, బ్రతిపాదించిరి. పరిగ్రహించుటకుఁగాను ధర్మమును బ్రతిపాదించిరి.

శ్లో॥ దశగ్రీవాదిషు ద్వేషో రామాది ష్వమితాదరః
కల్పితః కవిభి ర్లోకే స్వకావ్యై ర్నిగమోపమైః. 158

రావణాదులయందు ద్వేషమును రామాదులయందమితాదరమును వేదతుల్యంబగు తమకావ్యంబులచేఁ గవులు లోకులకుఁ గల్పించిరి.

శ్లో॥ అసత్ప్రవృత్తి స్సహజా నరాణాం
సదేవ వర్ణ్యం కవిభిస్తు కావ్యే
స స్యస్య హేతోః కృషి రిష్యతేఽలం
కిం దోహదంవై క్రియతేఽర్క హేతోః. 159

నరులకుఁ దప్పుదారిని పోవుట సహజము. కావ్యమందు మంచియే కవులకు వర్ణింపఁదగినది. లోకములోఁ బైరు పండించుటకు భూమిని దున్నుదురు గాని జిల్లేళ్ళ కెవఁడైన దోహదము చేయునా?

శ్లో॥ తత్త్వహీనాఽభవత్ క్షోణీ సర్వా స్థావరజంగమా
మాకందో మధురో నైవ గతా నింబేచ తిక్తతా. 160

స్థావరజంగమాత్మకమైన పృథివియంతయుఁ దత్త్వశూన్యమైనది. మామిడియందు మాధుర్యమును వేమునందు చేదును దగ్గుచున్నవి.

శ్లో॥ ఆస్తికో హ్యాస్తికో నైవ నాస్తికో నైవ నాస్తికః
న్యాయబద్ధా వుభా వద్య ప్రమాణపరివర్జితా. 161

పూర్వమందువలె నేఁడాస్తికుఁడాస్తికుఁడు కాఁడు. నాస్తికుఁడు నాస్తికుండు కాఁడు. తొల్లింటివారు న్యాయమునకు బద్ధులై యుండిరి. కాని నేటివారు ప్రమాణ వర్జితులు ప్రాచీన నాస్తికులు, పండితులు, తర్కశాస్త్ర నిష్ణాతలు. ఆధునిక నాస్తికులకు మూర్ఖత్వమేగాని పాండిత్యము లేదు.

శ్లో॥ గురుం హరిం పరిత్యక్త్వా రమారామాశయా పరమ్
యః కోవాపి భవే ల్లుబ్ధో హ్యాస్తికో నాస్తికోఽథవా. 162

కామినీ కాంచనముల యందాసదగిలి గురువును దేవుని గూడ పరిత్యజించి లుబ్ధులు వాటము కొలఁది యాస్తికులో నాస్తికులో యగుచున్నారు.

శ్లో॥ గురు శ్శిష్యశ్చ పుత్రశ్చ జాయాబంధుశ్చ కింకరః
స్వ ధర్మే నిహితాః పూర్వం తత్త్వశూన్యాహి తేఽధునా.

తొల్లింటి గురువులు శిష్యులు భార్యాపుత్రులు బంధుగులు కింకరులు వారి వారి ధర్మముల యందుండిరి. అనఁగాఁ బ్రాణాపాయ మందైనను స్వధర్మములను వీడరైరి. నేటివారల యందుఁ దత్త్వము గానరాదు. అనఁగా స్వలాభమునకై ధర్మమును వీడుదు రనుట.

శ్లో॥ అవిదితపరమార్థా హ్యాప్తసేవావిహీనా
స్సకలకుకవిసారా స్సంస్కృతగ్రంథదూరాః 164

విబుధవిముఖభావా వీతసత్యాదిధర్మాః
ప్రకటితనవమార్గా వ్యాసవిఖ్యాతవార్తాః 165

పత్రికలలో వ్యాసములు వ్రాయుట వలనఁ బ్రఖ్యాతి గడించినవారు, పరమార్థ మెరుంగనివారు, నాప్తులైన పెద్దలను సేవించనివారు, సమస్తమైన కుకవులు రచించిన యసత్కావ్యములను బఠించువారును సంస్కృతగ్రంధగంధమేని లేనివారును, బెద్దలయెడ విరుద్ధభావములు గలవారును సత్యదయాశౌచములు లేనివారును, వీరలే ప్రాయశః క్రొత్తదారులు దీసి ప్రకటించుచుందురు.

శ్లో॥ విమర్శకా స్తే వివిధాగమానాం
విశోధకా స్తే ఖలు శాస్త్రవాచామ్
వినూత్నశాబ్దస్య విధాయకా స్తే
విజ్ఞాన సింహాసన సుప్రతిష్ఠాః. 166

వారే నేఁడు విజ్ఞాన సింహాసనముల నధిష్ఠించి వేదములను విమర్శింతురు. శాస్త్రములను బరిశోధింతురు. క్రొత్తభాషాతత్త్వములను రచింతురు.

శ్లో॥ పాషండా నాస్తికా ధూర్తా వంచితా బాలకా జడాః
నార్యోఽనార్యా స్తమోలీనాః ప్రజ్ఞావాదేషు నిష్ఠితాః.

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య స్వరాజ్యాయ కృతోద్యమాః
తాత్కాలిక శుభావాప్త్యై త్వరమాణా గణేస్థితాః 168

శ్లో॥ స్వచ్ఛందం సంచరంతోఽపి సంఘనామ్నా చరంత్యహో
ఇత్థంభూతే జగజ్జాతే కింకార్యం ధర్మకాంక్షిభిః. 169

పట్టుదల గలవారై తమదే మంచిదని వాదించుపాషం డులును, వేదమందుఁ బ్రామాణ్యబుద్ధి లేని నాస్తికులును, నాయకుల పత్రికా ప్రాచుర్యముఁ జూచి మోసపోయిన బాలకులు, మంచి చెడుగు లరయఁజాలని జనులు నుద్రేకముగల స్త్రీలు నార్య సంప్రదాయమును బరమార్థము వదలిన వారు, తమకుఁ దెలియని పెద్దవిషయములను దెలిసినట్లు వాదించు వారు, సంఘములుగఁ జేరి తాత్కాలిక లాభములకొఱకు సర్వ ధర్మములు వదలి స్వరాజ్యమునకై యుద్యమించువారు, గురు దేవ శాస్త్ర విశ్వాసము లేక యథేచ్ఛముగా సంచరించుచుఁ దమ ప్రచారమునకు సంఘక్షేమమే ప్రయోజనమని వాదించు వారును లోక పూజ్యులై చెల్లుచున్నారు. ఇట్లు జగమంతయుఁ దారుమాఱు కాఁగా ధర్మము నభికాంక్షించు వారేమి చేయఁగలరు.

శ్లో॥ కలే రమోఘవీర్యత్వా త్ప్రతీకారో వృథాశ్రమః
తద్విస్మృతా స్తదస్పృష్టా యే కేచన మహోదయాః. 170

శ్లో॥ తే ధీరా ధర్మరక్షార్థమై తత్ర తత్ర చరంతివై
తితీర్షు స్తారయంత్యద్య నౌకా ఇవ మహోదధౌ. 171

కలిపురుషుఁడు దుర్వారుఁ డగుటచేత వానిని బ్రతిఘటించు ప్రయత్నము వ్యర్థము. ఆ కలిపురుషునిచే మరువఁబడినవారు వానిచే నంటఁబడనివారు నగు నే కొలఁది మంది ధీరులో యక్కడక్కడ మిగిలిన వారు, తరింపఁదలఁచుకొన్న వారిని సముద్రములో నౌకలవలె దఁరింపచేయుదురు.

శ్లో॥ నిరీక్షకేభ్యో గురవః ప్రసన్నాః
మనీషితార్థాః ఖలు సంతి లోకే
అలం జలం విందతి వై పిపాసు
స్తపేఽభిత ప్తేపి సర త్తటాకే. 172

లోకమునందు తెస్సగా వాంఛింపఁబడిన పదార్థము లుండియే తీరును. అక్కరతో నిక్కముగా నిరీక్షించువారికిఁ బ్రసన్నులగు గురువులును దొరకుదురు. గురువులు నేఁడు లోకమున లేరనరాదు. ఎంత వేసవిలోనైనను, చెఱువులు నదు లెండినప్పుడైనను దప్పి యడచుకొనుటకుఁ గొంచెము జలము దొరుకకపోదు.

శ్లో॥ ఋతుధర్మోఽప్రతీకారోఽప్యారామపరిశోషణమ్
కిం శుభం దృశ్యతే విజ్ఞైః పరిశిష్టం తు పాల్యతే. 173

ఋతుధర్మములు తప్పనివైనను చెట్లు తీఁగలు వాడి పోవుట శుభముగాఁ జూతురా? కష్టపడి శేషించిన వానిని బుద్ధిమంతులు కాపాడుదురు. వేసవిలోని చెట్లు చచ్చిపోవలసినదే యనునట్లు కలికాలముగాన ధర్మము నాశము కావలసినదే యనిన బాగుండునా యనుట.

శ్లో॥ పాఠ్యాని సర్వశాస్త్రాణి పరమార్థాప్తహేతవే
సద్గురుం ప్రాప్య ధీమద్భి రేకాంతే సంఘువర్జితే. 174

మూఁకను వదలి యేకాంతమున గురుసన్నిధిలో బుద్ధిమంతులు పరమార్థ ప్రాప్తికొఱకు సర్వశాస్త్రములు పఠింపఁదగును.

శ్లో॥ శాస్త్రజాతం పఠంతోఽపి భృతకాధ్యాపనే రతాః
పరమార్థం నజానంతి వైదికా లౌకికాంతరాః 175

శాస్త్రములు చదువుచున్నను జెప్పుచున్నను లౌకికాంతరంగులైన వైదికులు పరమార్థము నెఱుంగఁజాలరు. వేషము వైదికము, అంతరంగము లౌకిక మనుట.

శ్లో॥ స్రోతోవేగేన వాహ్యంతే జీర్ణపర్ణతృణాదయః
వారాన్నిధేః ప్రహారేణ పర్వతో న ప్రచాల్యతే. 176

కాలువలలో వరదలలో నెండిపోయిన యాకులు, గడ్డి మొదలగునవి కొట్టుకొనిపోవును. సముద్ర తరంగముల దెబ్బలకుఁగూడ పర్వతంబు చలింపదు ధీరులైనవారు కాలప్రవాహమునఁ గొట్టుకొని పోరు.

శ్లో॥ గురుగిరి మధిరూఢః కోవిదో గూఢసారః
కలిజలనిధిభంగైః కంప్యతే నైవ కించిత్
గురుచరణతరిస్థః క్షుభ్యతే నైవ నూనం
భవశరనిధిభంగై ర్బ్రహ్మతీరం గమిష్యన్. 177

గురువను కొండపై నిలచియున్న గూఢసారుండైన పండితుండు కలిసముద్ర తరంగముల కెంతమాత్రము జంకఁడు. గురుచరణ మను నావపైఁ గుదురుగాఁ గూరుచున్నవాఁడు సంసార సముద్ర తరంగములలో మునుగక సుఖముగాఁ బారము ముట్టి బ్రహ్మమును జేరుచున్నాఁడు.

శ్లో॥ చిత్తవృత్తినిరోధాయ ప్రాణాయామపరో భవేత్
బ్రహ్మచారీ గృహీచైవ పూర్ణసత్త్వా స్తదన్వితాః. 178

చిత్తవృత్తి నిరోధముకొఱకు బ్రహ్మచారులు గృహస్థులుకూడ ప్రాణాయామపరులు కాఁదగినది. ఏలననఁగా చిత్తము వశమగు వారలే పూర్ణసత్త్వముతో గూడి యుందురు.

శ్లో॥ మంత్రైః పాపనోదాయ గురుప్రోక్తై స్సదా జపేత్
సాత్త్వికాహారసేవీ స్యా న్నిద్రావిజయ హేతవే. 179

గురూపదేశము గలవాఁడై మంత్రమును పాప పరిహారము కొఱకు సదా జపింపవలెను. తమోరూపమగు నిద్రను జయించుటకు సాత్త్వికాహారమును సేవించవలెను.

శ్లో॥ దంభత్వాదోషనాశాయ సాధుసేవా ప్రకీర్తితా
మౌనంతు మితభాషిత్వం కలౌ యోగాంతరాయనుత్ .180

సాధుసేవచే దంభాదులు నశించును. కలియుగ మందు మౌన మనఁగా మితభాషిత్వము. దానిచే యోగాంతరాయమును జయింప వచ్చును.

శ్లో॥ అల్పారంభోఽపి సఫలో మోక్షోద్యోగః కలౌ యుగే
తత్త్వయోగనిపుణో గురుభక్తః కృతీ భవేత్ . 181

కలియుగ మందు మోక్షమునకుఁ బ్రయత్నమే మాత్రము చేసినను సఫలమగును. తత్త్వయోగ నిపుణుఁడగు గురుభక్తుఁడు కృతార్థుఁడగును.

శ్లో॥ ఆస్తాం మోక్ష స్త్రివర్గోపి రక్షణీయ స్సదాబుధైః
కథంచిదపి జీవద్భి ర్జన్మసార్థక్య హేతవే. 182

మోక్షము మాట యెటున్నను త్రివర్గము (ధర్మార్థ కామములు) రక్షింపఁ దగినది. తమ కెంత కష్టముగా జీవితము నడుచుచున్నను బుధుల కీ ధర్మము తప్పదు.

శ్లో॥ ఆపద్ధర్మశ తై శ్చాపి రక్షణీయ స్సదా బుధైః
స్వధర్మః కర్మ భూమిస్థై ర్లోకానుగ్రహకాంక్షయా. 183

కర్మభూమిలోఁ బుట్టిన బుధులగువా రాపద్ధర్మము లెన్ని యవలంబించినను దమ స్వధర్మము తాము లోకము ననుగ్రహించుటకై కాపాడవలయును.

శ్లో॥ దేవభాషా దేశభాషా స్వధర్మో విబుధైః కలౌ
రక్ష్యా స్సంపూర్ణ భావేన వార్యం తే కేన బాలిశాః. 184

దేవభాష, దేశభాష, స్వధర్మము పరిపూర్ణముగా బుధులు రక్షింపవలయును. కాని వీనినిఁ జెడఁగొట్టు తుంటరులు దేనిచేతను కట్టుఁబడరు.

శ్లో॥ ఆర్యావర్తం దివం విద్ధి పీయూషం విద్ధి సంస్కృతమ్
స్వధర్మం విద్ధి కర్తవ్యం గచ్ఛ భారత సత్పదమ్. 185

ఓ భారతా! ఈ భరతఖండమే స్వర్గమనియు, నమర భాషయే యమృత మనియు, కర్తవ్యము స్వధర్మమే యనియు యెఱింగి యుత్తమగతిం గాంచుము.

శ్లో॥ ఆయుష్యన్నప్రదే సౌమ్య గ్రాసవాసో భయాన్వితః
ఆత్మాలంబం విహాయాద్య కిం పరా నవలంబసే. 186

ఆయు వన్న మిడుచుండగా నన్నవస్త్రములు దొరుక వేమో యని భయపడెద వేల? ఆత్మాలంబనమును, ఆత్మీయులను, ఆత్మవిద్యలను, ఆత్మదేవతలను, నాప్తజనులను వదలి నేఁడేల పరుల నవలంబించు చున్నావు?

శ్లో॥ అస్మిన్ యత్సాధు తత్సర్వం గురుప్రోక్తం సుభాషితమ్
యచ్చాపభాషితం తన్మే సాధవః క్షంతు మీశ్వరాః. 187

ఇందు మంచిమాట లన్నియు మాగురువులు చెప్పినవే. పొరపాటులు నావిగాన సాధువులు నన్ను క్షమింపఁ దగుదురు.

శ్లో॥ గురో ర్నియోగా ద్గురుదత్తవాచా
గురోస్సపర్యాం గురుకావ్యరూపామ్
కరోతి శిష్యః పరమార్థబుద్ధ్యా
గురోః ప్రసాదస్య కిమస్త్యసాధ్యమ్. 188

గుర్వాజ్ఞను శిరసావహించి గురుదత్తవాక్కులచే గురు కావ్య రూపమైన గురుసపర్య పరమార్థబుద్ధితో శిష్యుం డొనరించుచున్నాఁడు. గురుప్రసాదమున కసాధ్య మెద్ది!

శ్లో॥ గురుపీఠేషు సర్వేషు సర్వ శాస్త్రార్థపారగాః
సంఘీభూయ బ్రహ్మవిద్యాం ప్రవదంతు కలౌయుగే. 189

గురుపీఠము లన్నిటియందు సర్వశాస్త్ర పారంగతులైన వారు సంఘముగాఁ జేరి యిక్కలియుగంబున జిజ్ఞాసువులగు వారి కధికారానుసారముగా బ్రహ్మవిద్యను బోధించి వారిని కృతార్థులను జేయుదురుగాక.

శ్లో॥ పురాణానీతిహాసాంశ్చ భాషయా ప్రవదం త్వలమ్
సమ్యగ్బోధాయ సర్వేషాం గ్రామే గ్రామే మహీసురాః190

బ్రాహ్మణులు ప్రతిగ్రామమందును సర్వజనులకుఁ దెలియవచ్చునట్లుగాఁ బురాణేతిహాసములను దేశభాషలలోఁ దెల్పుచుందురుగాక.

శ్లో॥ పఠంతు శాస్త్రాణి యజంతు దేవాన్
ధరామరా శ్చాద్య యథార్థ మన్యే
దీవ్యంతు సర్వే పరమాత్మనిష్ఠా
స్సమస్తలోకా స్సుఖినో భవంతు. 191

భూదేవులని పిలువఁబడు బ్రాహ్మణులు సార్థకనాములై శాస్త్రములను బఠించి దేవతలను బూజింతురుగాక. యథార్థముగా నితరులును బరమాత్మయందధికనిష్ఠగలవారై ప్రకాశింతురుగాక. సమస్త జనులు సుఖపడుదురుగాక.

శ్లో॥ గురునాథామృతానందనాథే నావిష్టచేతసా
ప్రోక్తో హ్యామృతసందేశో వైద్యరా డవధానినా. 192

అమృతానందనాథ గురునాథావిష్టమైన చిత్తముగలవాఁడై వైద్యరాజ దంటు సుబ్బావధాని యీ యమృతసందేశమును వచించెను.

—♦ అమృతబిందువులు ♦—

౧ స్వధర్మనిరతం బ్రాహ్మణ మన్యంవా యే అవమన్యంతే రాజానః రాజపురుషాః ధనికా వ్యావహారికా స్తే నూనమస్మరాష్ట్రసాధునిందకా ధర్మఘాతినో భవంతి.

స్వధర్మనిరతుండగు బ్రాహ్మణునిగాని బ్రాహ్మణే తరునిగాని యెవ రవమానము సేయుదురో (రాజులు, రాజ పురుషులు, ధనికులు, వ్యావహారికులు) మఱి యెవ్వరేని వారు నిక్కువముగా స్మరింపఁ దగరు. వీరు సాధునిందకులు ధర్మఘాతుకులు నగుదురు.

౨ స్వాధ్యాయ స్వధర్మౌ పరిత్యజ్య యస్తు పరధర్మా
వలంబేన సంచినోతి స వై బ్రాహ్మణబ్రువః.

స్వాధ్యాయము స్వధర్మము వదలి యెవ్వండు పరధర్మము నవలంబించి ధనము సంపాదించునో వాఁడు నామమాత్రుఁ డగు బ్రాహ్మణుఁడు.

3. అసంచయవతా బ్రహ్మనిష్ఠేన భవితవ్యం బ్రాహ్మణేన.

సద్బ్రాహ్మణుఁడు రేపటిచింత లేక బ్రహ్మనిష్ఠుండై యుండఁదగును.

ఇతి శ్రీమదమృతానందనాథ గురునాథ చరణారవింద మిళిం
దేన శ్రీతిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠాధి
కృతేన పండిత వైద్య రాజేనామృతలహ ర్యాంధ్ర
భామినీవిలాసాది నానామరభాషా భాషాప్రబంధ
రచనాధురీణేన సుబ్బావధాని కవిరాజేన
విరచితోఽయ మమృతసందేశః
ఓమితి శివమ్.



# శుద్ధపత్రిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 5 | 1 | వాఙ్మిత్రత్వం | వాగ్మిత్రత్వం |
| 5 | 9 | దుర్గాంబే | దుర్గాంబ |
| 10 | 4 | శౌచాదయో | శౌచాదయః |
| 11 | 2 | మానం | మానః |
| 15 | 2 | భూపాః | భూసాపాః |
| 53 | 18 | పరమార్గాప్త | పరమార్థాప్త |
| 55 | 1 | మంత్రిః | మంత్రిం |
| 55 | 4 | గురుప్రోక్త | గురుప్రోక్తం |

శ్రీ తిరుమల శ్రీనివాస తెలింగ మహావిద్యాపీఠము,

విద్యాశాఖ



# కవితిలక గ్రంథమాల,

3/71 లాయిడ్సురోడ్డు, కెథిడ్రిల్ పోస్టు, మద్రాసు.



శ్రీమతి కవితిలక కవితావిశారద విద్వాన్

కాంచనపల్లి కనకమ్మగారు రచియించిన

## పద్యగ్రంథములు

1. శ్రీ జీవయాత్ర — ఇది వేదాంతప్రతిపాదక మగు పద్యకావ్యము. రు 2—8—0

2. హంసవిజయము — ఇది మనోహరమగు వేదాంత నాటకము. రు 1—0—0

3. అమృతసారము - (పద్యకావ్యము) శ్రవణపేయమగు తత్వబోధ మిందుఁ గలదు. రు 1—0—0

4. ఆనందసారము—జిజ్ఞాసువుల కనితరలభ్యమగు తత్త్వరహస్యము లిందుఁ గలవు. రు 1—0—0

5. పద్యముక్తావళి — ఇది జీవయాత్రాంతర్గత పద్యసముదాయము. రు 0—8—0

6. శ్రీమద్రామాయణకథాసంగ్రహము - ఇది వాల్మీకీయ బాలరామాయణమునకుఁ గందపద్యములతో నైన యాంధ్రానువాదము. రు 0—6—0

7. ఆర్ద్రాభిజ్ఞాన శాకుంతలము: ఇది మూలము ననుసరించియు లలితమగు శైలిని వ్రాయబడిన నాటకము. కొన్ని తావులలో మూలమునకు వన్నె పెట్టబడినది. రు 1—0—0

8. రంగశతకము-ఇది కవయిత్రి తన పదియురెండవయేట నెల్లూరి రంగనాయకులపైఁ జెప్పిన కందశతకము. రు 0—4—0

—♦ వచన గ్రంథములు ♦—

1. రాధ - ఇదియొక సాంఘిక నవల. ఉన్నత పాఠశాలలోఁ బాఠ్యగ్రంథముగఁ జిరకాలముగ నుపయోగ పడుచున్నది. రు 0—15—0

2. గౌతమబుద్ధ చరిత్రము - ఇది బౌద్ధమత ప్రవక్తయగు బుద్ధదేవుని చరిత్రము. బాలికలకు, బాలకులకుఁ బఠించుటకు యోగ్యము. రు 0—10—0

కవితిలక కనకాంబగారి వచన గ్రంథములుగాని, పద్య గ్రంథములు గాని దాదాపన్నియును మద్రాసు యూనివర్సిటీ వారు కొన్ని యున్నత పాఠశాలలకు, కొన్ని ఇంటరు మిడియేటునకు, బియ్యేకుఁ బాఠ్య గ్రంథములుగా నేటేట నిర్ణయించు చున్నారు.

## —♦ ఇతరుల గ్రంథములు ♦—

1. ఆంధ్ర భామినీ విలాసము - వైద్యరాజ డాక్టరు దంటు సుబ్బావధాని కృతము. జగద్విఖ్యాతుఁడగు పండితరాయల భామినీ విలాసమున కిట్టి రసవంతమగు నాంధ్రానువాద మింతకు ము న్నెవ్వరును రచించి యుండలేదు. 1—4—0

## —♦ కవితిలకగారి గ్రంథములు - అచ్చులో నున్నవి ♦—

1. బోధకథాసుధ — (వచనము) తత్త్వబోధమున కుపయోగించు చిన్నకతలు. ఈ కతలు వ్యవహారమునను బరమార్థమునను సమయోచితముగాఁ బ్రయోగించిన శ్రోతల కపరిమితానందము కలుగును.

2 తోమాలియ—ఇది కవయిత్రి యాయాసందర్భములలోఁ జెప్పిన పద్యకుసుమముల సముదాయము. ప్రస్తావోచితము. మనోహరము. సమకాలికు లగు మహాకవుల యభిప్రాయ బోధకములగు పద్యరత్నములునుం గలవు.

## —♦ ఇతరుల గ్రంథములు - అచ్చులో నున్నవి ♦—

వైద్యరాజ డాక్టర్ దంటు సుబ్బావధాని కృతములు.

1. దాసగీత—ఆత్మానుభూతిని, గురుభక్తిని రసోద్రేకముగ దెల్పునట్టి పద్యకావ్యము. ఈ రీతి కావ్యములలో నిదియే మొదటిది.

2. అంబికాచరణ సరోజపూజ—ఇందలి భక్తి పారవశ్యము, ధారాశుద్ధి యుపాసకులకు హర్షదాయకములు.

3. చిత్రమాధవనాటకము—ఇది షేక్స్పియరు మహా కవి కామెడీ ఆఫ్ ఎరర్సు అను నాంగ్లనాటకమున కనువాదము.

4. ఆంధ్రవైద్యవిజ్ఞానము-ఇది ప్రాచీనార్వాచీనసంప్రదాయములను బోధించు గద్యపద్యాత్మకమగు వైద్యగ్రంథము.

5. అమృతానందనాథస్వామి చరిత్రము — సాధకులకు సిద్ధులకు అపరిమితానందసంధాయక మగు వచనగ్రంథము.

ధర్మవాది దంటు శ్రీనివాసశర్మ, బి. ఏ., బి.ఎల్,, గారిచే

—♦ వ్రాయబడిన గ్రంథములు ♦—

1. శ్రీ తులసీదాస చరిత్రము - ఇది మహాభక్తుఁడు మహాకవియు నగు తులసీదాసుని చరిత్రము. పద్యకావ్యము. ఆధునిక రచనయయ్యు రసభావభరితమై, యార్యవిజ్ఞాన సంప్రదాయ బోధక మగు లలిత పద్యకావ్యము. ముముక్షుజన శ్రేయము. రు 1—4—0

2. నాగభూషణ శతకము - ఇది శ్రీతిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యా పీఠస్థాపనాచార్యులగు శ్రీమాన్ అమృతానందనాథస్వామివారి, వ్యావహారిక నామమున కంకితముచేసి చెప్పిన భక్తిశతకము. గురువుల కంకితముచేసిన శతక మగుటచే సాధువులకు సంతోషకారిగానుండును. (అచ్చులోనున్నది)

---